ఓం
శ్రీ గురుభ్యోనమః
అచలర్షి

రామడుగు శ్రీ శివరామదీక్షిత గురుపీఠ
రాజయోగాశ్రమ

# తత్వప్రకాశిక

ఏతత్పీఠ సాంప్రదాయకులచే రచియింపబడి

అచలఋషి
**దయానంద సాందీపిని రాజయోగిగారిచే**
ముద్రింపబడియె

చతుర్థ ముద్రణ 2015 వెల : రూ.25-00

ఓం
శ్రీ గురుభ్యోనమః
అచలర్షి

రామడుగు శ్రీ శివరామదీక్షిత గురుపీఠ
రాజయోగాశ్రమ

# తత్వప్రకాశిక

ఏతత్పీఠ సాంప్రదాయకులచే రచియింపబడి

అచలఋషి
**దయానంద సాందీపిని రాజయోగిగారిచే**
ముద్రింపబడియె

చతుర్థ ముద్రణ 2015 వెల : రూ.20-00

# మున్నుడి

తత్వానికీ తత్త్వబోధకూ విడరాని సంబంధమున్నది. తత్త్వబోధకై మనసును ప్రోత్సహించేది తత్వం. తత్త్వబోధను మననం చేసుకునేందుకు కావలసిన మానసిక ప్రశాంతతను కలగజేసేది తత్త్వం. నిశిత పరిశీలనకు అనుకూలముగా, అన్వయంచేసుకోవడానికి, సాధనకు, అర్థవంత జీవనశైలి రచనకూ ప్రోద్భలం తత్త్వం. ఇది తత్త్వప్రకాశిక, దీక్షిత గురుపీఠ రాజయోగాశ్రమ తత్త్వాన్ని ప్రకాశితం చేస్తున్న తత్వముల ఫణిహారం. శోధకునికీ, సాధకునికీ రత్నం. చేత ధరించినా, కంఠమాళికగా గాత్ర ధారణం చేసినా, ఆస్వాదించి మనస్సున దాచుకున్నా సాంప్రదాయకులకు తత్త్వభూషణమై వెలుస్తుంది.

పాడండి, వినండి, వినిపించండి. తరుణోపాయాన్ని పొంది తరించిండి.

శ్రీ గురుకృపాసిద్ధిరస్తు.

అచలర్షి

**దయానంద సాందీపినీ రాజయోగి**

పీఠాధిపతి

# తత్త్వసూచిక

ఓం
శ్రీగురుభ్యోనమః
అచలర్షి

రామడుగు శివరామదీక్షిత గురుపీఠ రాజయోగాశ్రమ

# తత్వప్రకాశిక

శ్రీమద్రాజాధి రాజ మహారాజ రాజయోగీంద్ర చంద్రులగు
శ్రీమద్భాగవత కృష్ణదేశిక విరచిత

## 1. గురు మహిమాభివర్ణన తత్వము ఆట తాళము

### పల్లవి

యేమనీ నుడువూదునూ । నా భాగ్యమునునే ।
నెంతనీ పొగుడూదునూ

### అనుపల్లవి

భామినీమణి బుచ్చి వెంకమభర్త పరశూరామశీతా ।
రామదేశిక వరుడు నన్నిటరారయని దీక్షత్రయమునిడె ॥యే॥ ॥1॥

### చరణములు

సాధనలు బోధించీ । సంసారమునగల బాధలన్ని యడంచీ ।
శ్రీధరుడు విధి శివులు గురుడని ।సేవజేయుచు పంచముద్రలు ।
శోధజేయుము పైన జ్ఞానపుసుద్ధి నీకెరిగింతుననియెను ॥యే॥ ॥2॥

మిన్ను మొదలైనట్టి । భూతములకుండే వన్నెలైదిట బుట్టీ ।
యున్న కమలపు మధ్య మందున । వెన్నవలె వెలిగేటి పాపని ।
నిన్ను గాగనవోయియని నా కన్నులకు గనిపించ జేసెను ॥యే॥ ॥3॥

అంగమావరణమనీ । విక్షేప శక్త్యన । లింగమగు తెలియుమనీ ॥
అంగ లింగము సంగమున గల । యింగితంబెరిగించి రెంటిని ।
మ్రింగివేద్కను మదిని నీవుప్పొంగుచుండుటమటంచుదెల్పెను ॥యే॥ ॥4॥

చరణ తీర్థంబిచ్చి । త్రివిధ ప్రసాదము । బరువడిగ నందిచ్చీ ।
మరచిపోయిన స్వస్వరూపము । మరల నా మదికెరుక జేశియు ।
స్థిరముగా పరిపూర్ణబోధను । శరణనిన కరుణించె మురయుచు ॥యే॥ ॥5॥

నన్ను నిల్పకపాయా । నేనుండగానే । అన్ని మాయా మాయా ।
వున్నదున్నట్టుండెలేనిది యెన్నటికి లేదాయె కనుగొన ।
అన్నదీ విన్నదీ కన్నాదున్న దానరాదహోహో ॥యే॥ ॥6॥

కలను దృష్టాంతముగా । నీవుండ జూచి । అచలమును మెళుకువగా
తెలుసుకుంటే చాలు మీదటకులముగోత్రము వేరుదెంపను । కలువరింతలు
సమయుదీనికి । ఫలమిదింతకు యెక్కు వేదనె ॥యే॥ ॥7॥

నేగలను నీ తృష్ణా । దీర్చుటకు వినుమో । భాగవతులా కృష్ణా
వేగ వినిపించు మన వినినే । వేడిన వినుపించె నన్నియు ।
ఓ ! గుణాఢ్యుల్లారా ఓ ! పురుషోత్తమోత్తములార యికనే ॥యే॥ ॥8॥

శ్రీ సచ్చిదానంద వెంకటేశ్వరావధూతస్వామి కృతం

## 2. నాదనామ క్రియ రాగము – ఆటతాళం

### సాధులభావము

### పల్లవి

సాధులభావమిట్లుండు । పరమ । సాధుల భావమిట్లుండూ

### అనుపల్లవి

వేదాంత సిద్ధాంత రాద్ధాంత ధర్మములు
సాధించి శిష్యులకు బోధపరచెడి పరమ ॥సాధులభావ॥

### భక్తుల భావము

పరమభక్తిలో గురుని పాదములకు మ్రొక్కి । మురయుచు సేవాలుజేసేరు । దీక్షలరమరలేకానుజెందేరురా । రామస్మరణజేయుచు మదిలో యుండే రురా । తత్వాలెరిగి సాక్షిగాను నిలచేరురా । సరిగాను సాధనా సంపత్తి బొంది స । ద్గురు బోధ క్రమమూగ నెరుగు చుండెడి పరమ భక్తుల భావమిట్లుండూ ॥ 1 ॥

## యోగుల భావము

అష్టాంగ మంత్రలయ హట రాజయోగములు । నిష్ట సలుపుచు యుండేరురా । జ్ఞానదృష్టిచేతారకంచూచేరురా । సాంఖ్యం శిష్టాచారము గానుతర చేరురా । సర్వోత్కృష్మామగు అమన స్కంబొందేరురా ద్రష్టదర్శన ఆర్య । దర్పణభావమును । అష్టదళపద్మమున అనుభవించెడి । పరమయోగుల భావ మిట్లుండు ॥

## జ్ఞానుల భావము

అధ్యారోపము మరి । అపవాదయుక్తిచే । మిథ్యాజగస్పృష్టినెరిగేరురా । యెపుడు తథ్యముగను ఆత్మనాత్మలురా । మాయవిద్యాజీవేశ్వర ఐక్యమురా । బ్రహ్మ । విద్య శ్రవణమననధ్యాసాలురా సాధ్యముగ సమాధి సరిగా జీవన్ముక్తి । ఆద్యంతముగ నెరిగి ఆనందించెడి పరమ జ్ఞానుల భావమిట్లుండు ॥ ॥ 3 ॥

## అచలుల భావము

తనకు తానైయున్నా। దైవామందారోప। జననమరణ భ్రాంతి జగములురా । మాయాతనువు యెరుకలులేంది నెరిగేరురా । శ్రవణమనన ధ్యాస సమాధుల్ సలుపారురా । ఖర్మ అనుభవమనునది లేకుండూ నురా । అనయాము పరిపూర్ణ అచలస్థితినిజెంది పనిబూనికొనియెపుడు పలకకుండెడి పరమ అచలూల భావమిట్లుండు ॥ ॥ 4 ॥

## ఆర్యుల భావము

వుత్తబట్టబయలు యేమీలేదు । యని । చిత్తమందున యెపుడు దలచేరురా । స్వప్నవత్తీ గుర్తెరిగే శరీరమురా । యెపుడీషత్తే మిలే దాని యెరిగేరురా । బాలోన్మత్త పిశాచవత్ తిరుగేరురాదత్తులై గురువూకు దైవ మార్గమున । సత్త మాత్రములేక సంపూర్ణులగు పరమ ఆర్యుల భామమిట్లుండు ॥ ॥ 5 ॥

## గురువుల భావము

భాసురంబుగ బృహద్వాశిష్ట సిద్ధాంత ।  దేశికులు శివరామ దీక్షితులురా । వారినాశించి కంబాలూరప్పయ్యరా ।  బోధచేసిరి సీతారాముల కదియురా । వుపదేశించ ।  భాగవత కృష్ణునిచేరా । వాసీగ పీల్ఖాణ వరలక్ష్మణులు వెంక । టేశ్వరునికి దెల్ప దెల్పిరిలలో పరమ గురువుల భావమిట్లుండు ॥ ॥6॥

శ్రీ భూమానంద హనుమంత రాజయోగిగారి కృతం

## 3. శంకరాభరణ రాగం - ఆటతాళం

### పల్లవి

అందురూ అందారందురూ । మాదచలబోధని । అందురూ అందారందురూ॥

### అనుపల్లవి

1. అందురూమాదచలబోధని । కొందరికి ఉపదేశమిచ్చుచు సందియ
ములనుదీర్చలేకను । బంధమునబడ ద్రోయనెంచి ॥అందురూ॥

2. వాటమగుబృహద్వాశిష్ట । పీఠమర్మాధర్మములు మది । నాట సద్గురు
సేవజేయని । బూటకులు మరి మాటిమాటికి ॥అందురూ॥

3. దట్టమగు కందార్థములలో । గుట్టుగురుని నోటవిన । లేనట్టి మను
జులు గ్రంధములగని । మిట్టిపడి లోకులను జెరచుట ॥కందురూ॥

4. పండితాగర్వంబుచేగురు । నండజేర జాలలేకను । తిండికై ఇంటింట
మేమే । దండివారల మంచు దిరుగుచు ॥అందురూ॥

5. పితృనైశ్వర్యంబుకన్న । పుతృడందినరీతిబోధ । సూత్రములు
నాసాంప్రదాయ । పాతృలెరిగెదరంచు దెలియక ॥అందురూ॥

6. మూడువాక్యమూలగొప్ప గూఢమైన జాడనెరుగక । గాఢమగు
అజ్ఞానవశమున । గాధలోబడిపాడుజేయుట ॥కందురూ॥

7. పెద్దలూగుమిగూడి గురువరు । సుద్దులను గొనియాడుచుండగ
వద్ద మూర్ఖులు జేరిమేమే । పెద్దలముయని బుద్ధి శూన్యులు ॥అందురూ॥

8. కానిలేనిమోసయుక్తులు । కల్పనలుజేయూచు ధరలో । మానమభి
మానంబు విడిచి । మందుమతులగుజ్ఞాన శూన్యులు ॥అందురూ॥

9. గుసగుసలు మాట్లాడిగొప్ప । గురురహస్యము తెలుపదగదనిగసిబిసి
నిగా జేసి లోకుల । గాసిబెట్టి చెరుపదలచి ॥అందురూ॥

10. భాసురంబుగ శ్రీశికింద్రా । బాదుసద్గురు మందిరంబున । వాసి
కెక్కినహనుమయార్యుల । వాక్యములుమదినాటలేకను ॥అందురూ॥

అచలర్షి శ్రీ దయానంద పొన్నాల రాజయోగి గారి కృతం

# 4. భైరవి రాగము – ఆదితాళము

## పల్లవి

యేమోమీకరుణామృతంబూ । తెలియ । దేమోమీకరుణా మృతంబూ ॥

## అనుపల్లవి

1. నా స్వామి మిముబొగడ । నాదీశేషునితరమా ॥యే॥

2. యెన్నోదిక్కులదిరిగి । వున్నాదెరుగలేక । తిన్నాగమిముజేరుకుంటీ ।
అన్నీ । విధమూలమిమునమ్మియుంటీ । కన్న । తండ్రీ ననుకరుణించు
మంటీ । అన్న । మీకన్నదయదల్చి । బ్రోచేవారెవరన్న ॥యేమోమీ॥

3. సాధనంబులజేసి । బాధాలొందితిగాని । యేదారితెలియాలేనైతి
వాద । భేదాములుడుగాలేనైతి । బోధ । గురువూలజేరాలేనైతినాదు ।
బాధల బోదోలి । భేదారహితపర్చు ॥యేమోమీ॥

4. నాసికాగ్రమూన । కాశీపురంబాని । వాసీగబోధింతురన్న । జీవ
బ్రహ్మైక్యపద వాదటన్న । కన్న । యికజన్మలేదానిరన్న । అన్ని
బాధాలొందుటె కాని । భ్రమరహిత మేదన్న ॥యేమోమీ॥

5. బూతినామాల్‌బెట్టి । దాతాలమేమనుచు । ఖ్యాతీగ బోధింతురన్న ।
కూటికై భ్రమసెకుక్కారీతన్న । వీరిబూటకపు మాటాలువిన్న । వారి
డంబములను జూచి । దండామర్పణజేస్తి ॥యే॥

6. ధరశికింద్రాపూర । సురగూరు హనుమయార్య । సరగూన
నను బ్రోవ రావ । పూర్ణ । భావంబు సూచించలేవ । దాతవని నమ్మి
దరిజేర్తిగావ । పి.రాజయ్య । దాసూనిరక్షించువేవేగ ॥యే॥

## 5. కేదారగౌళ రాగము - ఆటతాళం

### పల్లవి :

వినవేదెలిపెదరుక్మిణీ మద్గురుబోధ । కనవేసద్గుణమానినీ

### అనుపల్లవి :

1. వినవెదెలి పెదవివరముగనీ । మనముననుగలకోర్కెదీరగ । ఘను
దగూ సాందీపగురునిచే । గనినపూర్ణ భావమిప్పుడు ॥వి॥

2. యెంచాయీయాత్మయందూ । వుదయించెను । పంచభూతములు
ముందూ అంచితము గోషధులు అన్నము । మంచిగా నరులా
దిసకలా । సంచితాదికర్మ జగమూ చక్కగా నుత్పత్తి ఆయెను ॥వి॥

3. జ్ఞానమనోబుద్ధియూ । చిత్తహంకార । మను అంతారేంద్రియములూ ।
వ్యాన ప్రాణముదానపానస మానమును ప్రాణేంద్రియంబులు
ఘ్రూణశ్రోత్రముత్వక్కు చక్షువు । జింహయనుజ్ఞానేంద్రియంబులు ॥వి॥

4. రసగంధ రూపాస్పర్శా । శబ్దంబాను । విషయేంద్రియాపంచకం ।
రచనగా వాక్పాణిపాదము । గాంచగా కర్మేంద్రియములు । ముసురు
కొని యీ అయిదులైదై । మురికి దేహంబా యెకనుమిదె ॥వి॥

5. సరసీజనే త్రివినుమూ । సాంఖ్యంబిదియె । చక్కగా మదినుంచుమూ
విరివిగా తారకముదెలిపెద । నరయత్యాగులుయోగి వర్యులు
మురయుచును నాముసులు ఋషులు । ముక్తి జెందిరి మూల
మెరిగియు ॥వి॥

6. ఆధారస్వాధిష్టామూ । మణిపూరక । అనహతవిశుద్ధమూ అందముగ
ఆగ్నేయచక్రమునంది । ఆనందంబుబొందిన । సదానందంబందు
సహ । స్రారమందున జేరువారికి ॥వి॥

7. పరహంససంచారమూ । పావనివినుము । పూర్వదళమున
పుణ్యమూ అరయగా ఆగ్నేయదళమున । అందినిద్రాలస్య
మొందు విరివిగా దక్షిణము కౄరము । నైరుతిన పాపంబు జెందు ॥వి॥

8. పక్షమము క్రీడాసక్తి । వాయుగమనం । పరగావుత్తర రతియుక్తి
నిశ్చయము యీశాన్యమందున । నిలచిదానము జేయుచుండు
ను స్వచ్ఛముగ మధ్యేవిరాగ । దీక్ష జెందును దివ్యముగను ॥వి॥

9. అనువుగాకేసారిలో । జాగ్రతజెందు । కర్ణికలొస్వప్నామొందూ
వినయముగలింగంబు నందున । చనువుగా సుషుప్తిజెందునువూని
పద్మ త్యాగమందున । మానకాతూర్యంబుజెందును ॥వి॥

10. యిదియే అమనస్కంబగూ । యోగనిద్ర । యిదియే సమాధియగూ
యిదియె శివజీవైక్యమంద్రు । యిదియే నిర్నిద్రనుచు దెలియుము
విదితముగ మహావాక్యములనా । వివరమంతయు వేగదెలిపెద ॥

11. అయమాత్మ బ్రహ్మంబానూ । తత్వామసీ । అహం బ్రహ్మోస్మియునూ
నయముగా ప్రజ్ఞాన బ్రహ్మం । బాయె మహావాక్యంబులన్నియు
రయమునా బ్రహ్మంబునేనని । రమ్యముగ బోధించుచుండును ॥వి॥

12. తరుణిసాధానంబులు । అన్నియుజేయ । తరియించదీజన్మమూ
అరయగా పరిపూర్ణబోధ । యెరుగకను హరిహరులకైన యెరుక
దొలగదుయెన్నటికియా మరుగు దెలియక మమతజెందెరు ॥వి॥

13. ఈవృత్తబట్టబయలూ । యేమియులేదు । యిదెపరిపూర్ణాబ్రహ్మమూ
యెన్నగా యీ బ్రహ్మమంతట । యేమిగాకనునిండి యున్నది
యెరుక యన్నది లేనెలేకను । యేకమై తానంతటున్నది ॥వి॥

14. మూలములేనిగుర్తెరిగే । శరీరము మొదటికిలేదానుచూ చాలగామది
నమ్మియుండిన । యేలయీశాస్త్రంబులన్నియు కీలు గురునిచె
మరుగు దెలసిన । కాలిపోవును కర్మబంధము ॥వి॥

15. ధరణిశికింద్రాపురా । మందిప్పాల । వరహనుమద్దేశికేంద్రాగురుని
పాదము గొలచివేగమె । పూర్ణబోధను జెందియెరుకును తిరిగి
చూడకుమనుచుదెలిపెను స్థిరముగను పొన్నాలరాజయ ॥వి॥

శ్రీ అమలానంద తైదల కొమరయ్య రాజయోగి గారి కృతం

## 6. భైరవి రాగము - ఆదితాళం

### పల్లవి

1. శరణు శ్రీ సద్గురుమూర్తి । నరయ శరణార్థునీయార్తి

### అనుపల్లవి

దీర్చుమావేగసంపూర్తి । తరమెనుతిజేయనీకీర్తి ॥శరణు శ్రీ॥

2. అయ్యనామనవిదేనండి । చయ్యన ఆలకించండి । ఇయ్యెడ దాచ
బోకండి । నెయ్యముతోడ దెలుపండి ॥శ॥

3. యెరుకకూమూలమేదయ్యా । యెరుకనేదెంత్తటీదయ్యా । యెరుక
నెచ్చోటికరుగయ్యా । పరమనే పదముజూపయ్యా ॥శ॥

4. సరే నీవెరువకోపృథుకా । మరేభయమ్ములేదింకా । తీరునీ ఘోర
మగు శంకా । యెరుక పేరణతు వినుమింకా । ॥శ॥

5. ముందుగా అచలమెరిగింతు । పొందుగా మూలమినిపింతు । చంద ।
మానెరుకవివరింతు । యెందులేనెరుక విడిపింతు ॥శ॥

6. అదొఅచలంబుకనుగోర । మొదలుకొనయెన్నరానిదిర సతతమూ
నిండియున్నదిర । ఇదియే గురు గుహ్యమూ వినర ॥శ॥

7. మూలమానెండమావులురా । బాలనెరుకనుగమృగమూరా । జలమని
భ్రమసిపరుగిడిరా । అలసి ప్రాణమ్ము విడిచెరా ॥శ॥

8. లేనికుందేలు కొమ్ముచెరా । కానియాస్థాణుపురుషునిరా పూని
పొడవగనెరక్తమురా । రానిదేర్లయ్యిపారెనురా ॥శ॥

9. దెలసెనా క్రమమునిజబోధ । దెలిసితే యున్నదాబాధ । దొలగెనా
దెలుపుయుతమేధ । బలుకు నేవిందునీగాధ ॥శ॥

10. అంతయింతనగరానిదీ । నంతునలువాదులెరుగంది । సంతతా
మేక మయ్యుంది । అంత పరిపూర్ణమైయుంది ॥శ॥

11. దీనిలోలేని నారాకే । ట్లనిన నీరందునాలేక మీనముల్దోచి
నున్నాక । చనినతానున్న దెరుగాక ॥శ॥

12. గురువరావింటిరీగాథ । దీరెనంచంటిరీ
సోద సరగునగొనుముగురునాథ । యెరుకదక్షణమన్నాథ ॥శ॥

13. అనుడిహనుమంత్త ఆర్యులుజై । గనుడి రాజన్న గ్రామణిజై ।
వినుడి కొమరయ్య వివరముజై । చనుడినేమీరుళక్మీజై ॥శ॥

జీవాత్మ సంవాదము

## 7. శంకరాభరణ రాగము - ఆదితాళం

**పల్లవి :**

1. యేతీరుగనను దయజూచెదవొ । యిమ్మహి జీవునిసాత్మ ।

**అనుపల్లవి :**

నాతరమాభవసాగరమందున నొంటిగనుండుటనాత్మ । యేతీరుగ ॥

2. ఇంద్రియంబులకు నవ్వలివాడను । నని వ్రాసితివీ ఆత్మా ।
యెందు ననుండెదనని వ్రాసితివొ నింతతెల్విలేదాత్మా ॥యే॥

3. తారకజపములో హంసనుయేనని । దరుచుగవాగితివాత్మా । మురు
గుడుముక్కే ఆలయమన యీ । మరుగెరుగవుగద ఆత్మా ॥యే॥

4. అన్నము నీరును ముట్టక మదముచె । అమనస్కంబని ఆత్మా ।
తిన్న గజేయగ యిద్దరిమనగతి । సన్నగిల్లెగద ఆత్మా ॥యే॥

5. మేనుజడమునేన జడంబనుచూ । మానుగవదిరితివాత్మా । మేను
విడిచి మరి వంటిగనిలిచి । మొరిగితెమెరుగౌ ఆత్మా ॥యే॥

6. ఆత్మ నాత్మల కవ్వలిదచలము । ఆత్మనునే నంచనియాత్మా ।
అత్తకొడుకు తోననగ బుద్ధాకింతలేదటే యాత్మ ॥యే॥

7. ఆత్మయెజ్ఞానము జ్ఞేయము మరియా । నవ్యక్తంబూనే నాత్మ ।
ఆత్మకు అహంకృత్వం చార్ధము అవకతవకనే ఆత్మా । ॥యే॥

8. తెలియుమీలాగున । తెలివిదేహమూ । తలపకువేరనియాత్మాక
లియుమునిజగురు సన్నిధికేగి కాళ్ళు మ్రొక్కు ఘనాత్మా ॥యే॥

9. కలసితిగురునిదెల పెనుమర్మము । కలవలెనాగతి నాత్మన్ దెలియక
వ్యర్థులు అర్థమెరుగకా దలపగ వేరుగానాత్మన్ ॥యే॥

10. యేతీరుగ విచారణ జేసిన యెందున మూలము లేదూ । నా తరమా
పరిపూర్ణమున్న దంచనుటయె వట్టపవాదూ ॥యే॥

11. యెరిగితి యిప్పుడు నీదయవల్లను । యిద్దరమొకటె జీవాత్మా ।
మొరిగితిదెలియకలేరని యిప్పుడు । అరయగనేమృషజీవాత్మా ॥యే॥

12. తీరెను యిక్కడితో నాచేష్టలు తెల్పుటకి ఘనావెతలు । దీరెను
నిజ పరిపూర్ణ బోధగురు । దాపుజేరి యే స్థితులు ॥యే॥

13. ధరలో హనుమద్రాజదేశికా । దాసతైదల కొమరయ్యా ।
యెరుకపరచె మీ రెరిగితేను । లేనెరుకలేకనే చనునయ్యా ॥యే॥

## 8. తత్వము

భూమానందా । సద్గురు నామనంద । భూమనంద ।

1. భూమానందాగురూ । నామము హనుమంత
నామూని మదిలోన ప్రేమాతొ దలుతు ॥భూమానంద॥

2. మీరాజ్ఞ యిస్తిరి । నారితి యేవింటీ
యెరుక మరుపుజో । లెరుగబోనండీ ॥భూమా॥

3. మతములన్ని బహు । గతులపాల్జేయుదు ।
ర్గతుల జోలెరుగనా । గతి నీవేతండ్రీ । ॥భూమా॥

4. కోహం కస్త్వంబానే । వూహల పుట్టిల్లు ।
దేహిదేహమూల । దెలియాదు బయలు ॥భూమా॥

5. పరిపూర్ణ మెరుకా । పరికించగాలేని ।
యెరుకే బ్రమగ్గుభస్మా । సురునీ విధంబూ ॥భూమా॥

6. వాసీగ కొమరయ్య । దాసూని భ్రమలెల్ల ।
దోసుకున్న డదో । అశరీరుడన్న ॥భూమానందా॥

శ్రీ దయానంద పొన్నాల సాందీపిని రాజయోగి గారి కృతం

## 9. శరణు

పల్లవి : శరణు శరణు శ్రీదయానందగురు సార్వభౌమ శరణూ
శరణుగోరితిని కరుణజూడు నను రాజయార్య శరణూ
. జననమరణముల దాటెడి మార్గము తెలుపుమయ్య శరణూ
కరుణజూచి నను దరిని చేర్చుమయ, శరణు శరణు శరణూ ॥శరణు॥

చరణం :

1. చలనము గానిది, చలితము చొరనిది, చలనము జోలికి పోనిదనీ
చలనము వీడిన నావల తెలియును, అచలము, మేల్కొని చూడుమనీ,
తెలిపిన శ్రీగురుసార్వభౌమ ఇదె, శరణు శరణు శరణూ ॥శరణు॥

2. కలలోదోచినవన్ని మేల్కొనిన ఒక్కటి లేవని తెలియుమనీ,
కల సంసారమునెరిగి విడిచినను, కైవల్యము తానుండునని,
తెలిపిన శ్రీగురుసార్వభౌమ ఇదె, శరణు శరణు శరణూ ॥శరణు॥

3. ఎరుకే నీవును, ఎరుకే నేనును, అఖిలము ఎరుకే తెలియుమనీ,
చలితము, చలనము సర్వము ఎరుకే, ఎరుకే సర్వము తెలియుననీ
తెలిపిన శ్రీగురుసార్వభౌమ ఇదె, శరణు శరణు శరణూ ॥శరణు॥

4. సాంఖ్యము తారక అమనస్కంబులు మహావాక్యంబులు తెలియుమనీ
తెలివిలేదుగద తెలియను మీదట, ఆ తెలివిదాట, అదె పూర్ణమనీ,
తెలిపిన శ్రీ గురుసార్వభౌమ ఇదె, శరణు శరణు శరణూ ॥శరణు॥

5. బయలుకు బయలుగ ఉన్నది పూర్ణము బట్టబయలదీ తెలియుమనీ
ఉన్న బయలునూ తెలియగనే నీవున్న బయలునిదె విడువుమనీ...
తెలిపిన శ్రీగురుసార్వభౌమ ఇదె, శరణు శరణు శరణూ ॥శరణు॥

6. కలలో వచ్చిన సర్వము శ్రీగురు కరుణతో మేల్కొన చనునుగదా,
మేల్కొని గుర్తుతో ఎరుకను వీడిన అంతటనున్నది పూర్ణమనీ,
తెల్పిన శ్రీగురుసార్వభౌమ ఇదె శరణు శరణు శరణూ ॥శరణు॥

7. ధరను సికింద్రపురి దయతో వెలిసిన రాజయార్యగురు శరణమయా,
కరుణతో సాందిపుదాసుని బ్రోచినదయానంద గురుశరణుమయా
శరణు శరణు శ్రీదయానంద గురుసార్వభౌమ శరణూ
శరణుగోరితిని కరుణజూపితివి, శరణు - శరణు - శరణూ ॥శరణు॥

శ్రీసదానంద యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు
బి.ఎ.బి.ఎల్.
గారి కృతం

శ్లో॥ నమోస్తు గురవే తుభ్యం సహజానందరూపిణే
యస్యవాగామృతం హన్తి విషం సంసార సంజ్ఞికం ॥

శ్లో॥ యస్య ప్రసాదా దహమేవసర్వం
మయ్యేవసర్వం పరికల్పితంచ
యిత్థం విజానామి సదాత్మరూపం
తస్యాంఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యం ॥
శ్రీ సద్గురుదేవుని యాగమనము - స్వాగత ప్రయత్నము

## 10. భైరవి రాగము - ఆదితాళము

**పల్లవి :**

సద్గురుదేవుడు చనుదెంచెడి శుభసమయముదోతెంచెన్ శ్రీ సద్గురుదేవుడు ॥

**అనుపల్లవి :**

కాకి కావుమని గంతిడె ప్రశ్నకు కలికిరా కనుగొనవే ।
దక్షిణ నేత్రము స్పందించిన శుభోదర్కముగాదటవే ॥ ॥శ్రీసద్గురు॥

**చరణములు :**

1. మలయపవనుడూ చిరుకెరటాలతొ మంద మంద ముగవీతెంచెన్ ।
సురభిళ మధురాసుమ సౌరభముతో శుభవార్తను నాకెరిగించెన్
శ్రుతి వీధులలో మధుర మధురముగ ఛిణిఛిణి నాదము
చెలువొందెన్ హృదయతంతువులు ముదమున రేగిమధుర గీతికల
మలయించెన్ ॥శ్రీసద్గురు॥

2. ప్రకృతికన్యాపులకిత గాత్రయై ఫలపుష్పాదులు సమకూర్చెన్ ।
కొదమతుమ్మెదఝుంకృతి శృతిగా కోయిలపాడె సుస్వాగతమున్ ।
సలలిత చంద్రోదయమున సింధువు చెలరేగెడిగతిగా । ఆనందర
సాతిరేకమున, అతివరొహృదయముప్పొంగెన్ ॥శ్రీసద్గురు॥

3. స్వామికి యెదురై అర్ఘపాద్యములు సరగున నిడగా వలయున్
భద్రపీఠమున ప్రభువునునిల్పి పదములు మెల్లన నొత్తవలెన్ ।
సురటీ చేగొని శ్రమబాయవీచి షోడశపూజలొ నర్చవలెన్ ।
పదపద త్వరగా, గురుపద పూజకు భద్రపరచవే సర్వంబున్ । ॥శ్రీసద్గురు॥

4. శ్రీయనసూయా చేడియగూడి సికింద్రాపురినున్నాడే । అందరు
దయానందుండనగా యెరుకవీడితానున్నాడే యీ జగన్నాథుడై
శ్రీజగన్నాథుడై యేజగద్భ్రాంతి లేకున్నాడే । సీతారామచంద్రులు
తన్నుచేరి కొల్వసుఖమున్నాడే ॥శ్రీసద్గురు॥

గురుఅష్టకము

ఆంధ్రా నుకరణము

# 11. భైరవిరాగము ఆటతాళం

**పల్లవి :**

ఎందుకూ ? అన్నీ యెందుకూ ?

**అనుపల్లవి :**

శ్రీగురు పదసరసీరుహ యుగళము చిత్తము లోపల
హత్తుకొననిచో । ఎందుకూ అన్నీ ఎందుకూ ॥

1. భార్యాపుత్రులు – పౌత్రులు బంధువుల్
మేడలు ధనములు మిక్కిలి గల్గినా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

2. వేదవేదాంగాలు విద్యలు శాస్త్రాలు
పఠియించినేర్చిన పండిత కవియైనా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

3. దేశవిదేశాల సత్కీర్తిగాంచినా
సత్కర్మసల్పెడి సచ్ఛీలుడే యైనా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

4. రాజరాజేంద్రూల పూజలు గొనుదివ్య
పదములుగల మహా ప్రతిభాఢ్యుడే యైనా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

5. అష్టాంగయోగంబు, అంబరగమనంబు
రారాజభోగంబు, రమణీయ ధనంబులు ॥ ఎందుకు ॥ శ్రీ ॥

6. దానధర్మాలలో ధైర్యశౌర్యాలలో
సద్గురు కరుణచే సద్యశ మందినా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

7. కానల కేగిన । గార్హస్థ్యమూనిన । దేహాత్మ బుద్ధిని
స్థిరముగ వీడినా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

8. వెలలేని రత్నాలు వేవేలుగల్గినా
సుదతీపరిష్వంగ సుఖములు గల్గినా ॥ ఎందుకు ॥ శ్రీ ॥

9. ఏ యాశ్రమమందున్న యెవ్వరికైననూ
యిదిపాడినన్ గల్గునిహపర సౌఖ్యాలు
వాంచితార్థముదీరు బ్రహ్మపదవిని జేరు
గురుమంత్ర సిద్ధుడై గుణరహితుడై యొప్పు ॥ ఎందుకు ॥ శ్రీ ॥

10. శ్రీ రాజయోగీంద్రు సేవించునీరామ
చంద్రునితోగూడి శరణాగతులుగాక ॥ ఎందుకు ॥ శ్రీ ॥

అన్నీ ఎందుకూ । శ్రీగురుపదసరసీరుహ యుగళము
చిత్తములోపల హత్తుకొననిచో ॥ ఎందుకు ॥ శ్రీ ॥

## 12. కళ్యాణి రాగము - ఆదితాళము

**పల్లవి :**

నీవేకదామాకుదైవం । నిజగురుమూర్తిం

**అనుపల్లవి :**

దేవాదిదేవనుత దివ్యప్రభావం

1. ప్రాగర్థచరమార్థ యోగాస్వరూపం
దిగ్దిగంతవ్యాప్త దివ్య ప్రతాపం ॥నీవేకదా॥

2. శివమాధవ భావ సేవితపాదం
శిష్యజన సందేహ శీఘ్రా విచ్ఛేదం ॥నీవేకదా॥

3. సకల విఘ్నధ్వంస సత్తాస్వభావం
విఘ్నేశనామ్నాసు విబుధసం సేవ్యం ॥నీవేకదా॥

4. అజ్ఞానతి మిరాంధకారావినాశం
విజ్ఞానసర్వస్వ విభవా ప్రకాశం ॥నీవేకదా॥

5. శ్రీరాజయోగీంద్ర శ్రితపారుజాతం
యీరామచంద్రనుత ధీరాసుచరితం ॥నీవేకదా॥

## 13. మోహనరాగము - ఖండగతి

**పల్లవి :**

పాడుమా ! పాడుమా ! ప్రభుని మంగళగీతి

**అనుపల్లవి :**

పాటతో నీమనసు ప్రభుపాద సన్నిధికి
పయనమైపోవాలి, పాదాల వ్రాలాలి ॥పాడుమా॥

1. ప్రభుదివ్యనామ సంభరితమై నీతనువు నాద బ్రహ్మంబులో
నైక్యమయ్యేటట్లు ॥పాడుమా॥

2. బట్టబయలగు నీవేపరమాత్మ వేగావె, స్వస్వరూపానంద
సరసిడోలికలలో నూగగానేలా, కలలజోగ గానెలా ॥పాడుమా॥

3. నీకన్యమై యెపుడు నిలచున్నదదె పరము
దానిగాంచీ నీవు తరలిపోవుటెదారి ॥పాడుమా॥

4. కలమేల్క లెరిగి నీకలబాయు మార్గంబు
శివరామ దీక్షితా సిద్ధాంతమేనంచు ॥పాడుమా॥

5. గురుశిష్యులిర్వురునుగూడి యొకటైనంత
గుణములేదిసు మంత గుర్తుమీరినదంత ॥పాడుమా॥

6. శ్రీరాజయోగిగురు సేవించి భావించి
జననమరణ భ్రాంతి ఝుడుపుతీరేవరకు ॥పాడుమా॥

7. దేశికేంద్రుల నోట తెలుసుకొన్నామాట
రామచంద్రునిపాట రాజయోగపుబాట ॥పాడుమా॥

## 14. శంకరాభరణరాగము - ఆదితాళం

**పల్లవి :**

శ్రీ రాజయోగి సద్గురు పదసరసీజములను వీడక గొలువండీ

**అనుపల్లవి :**

యెరుకమరుపులూలేని బయలుగని యెరుకమరుపులను వీడండీ

1. సర్వకాలముల సర్వదేశముల సర్వవస్తువుల నిశ్చలమై
నామరూప క్రియనటలు భవనాశస్థితిలేందీ బయలూ దానిచె
బుట్టక, దానిచె పెరుగక, దానిలొ లయమవకా దాని
యంతటది స్వకారణంబుగతోదోచెను యీ యెరుకెపుడో ॥శ్రీ॥

2. సురులకు కల్గిన స్వప్నమువంటిది పరిపూర్ణములొ యెరుకండీ
మృగజలమువలె యెరుకబయలు నామిథ్యా రోపీత మేనండీ
అనిల చలనముల యలజడీ యున్నా ఆకసమెట్టుల నిశ్చలమొ
యెరుకవచ్చినా యెరుకపోయినా యేమియునెరగదు యీ
బయలూ ॥శ్రీ రాజా॥

3. ఎరుకనయేదో మరుపనయేదో యెరుకమరువులకు స్థానం
బేదోరూపంబేదో లక్షణమేదో రూఢిగా గురునిచే యెరుగవలెన్
యెరుకను కూకుడు వేరుతొనరికిన యెరుక భ్రాంతులూ దొలగునయా
సద్గురుమంత్రంబనుకుతారమేచక్కనియా యుధమిందుకయా ॥శ్రీ॥

4. ద్వాదశిషోడశి మంత్రార్థంబులు తప్పక గురునిచె తెలియవలెన్
రూపుదాల్చిన పురుషోత్తముడని రూఢిగ సద్గురు కొలువవలెన్
మంత్రజపంబున మనుసునిల్పగా మహిమాన్వితుడౌ మనుజుండూ
మన మంత్రజపంబుచే యెరుక మాయమై మహాద్వైతమే సిద్ధించు ॥శ్రీ॥

5. సాంఖ్యతారకాయ మనస్కంబులు సద్గురుసన్నిధి నేర్వ వలెన్
వస్తు రూపయాదార్థ జ్ఞానము ప్రత్యక్షముగా కలుగవలెన్
ఉన్నది పూర్ణము లేనిది యెరుకనె యూహ మాత్రమే చాలా?
ఎరుకయేదియో విడచుటెట్టులో యెరుగకపోతెయెలా ? ॥శ్రీ॥

6. తల్లిదండ్రులూ దారాపుత్రులు దైవముతలపగ సద్గురుడే గురు
దేవుని శ్రీవిమలపదంబులు గొలిచిన, భవహర మగునండీ తను
మనధనములు త్రికరణ శుద్ధిగ ధారబోయు టామన వంతూమరి
మార్జాలకిశోర న్యాయమునమమునడిపించుటగురువంతూ ॥శ్రీ॥

7. సత్యము, శౌచముదయయూ ధర్మము సాత్వికాహారవ్యవహారము
లూకలిగి క్రమంబున నంతఃకరణముమల విక్షేపము బాయవలెన్
కర్మ నొనర్చుట తప్పదుగాక కర్తృత్వము లేకుండ వలెన్
పాపపుణ్యమూలంటని రాజమార్గము గురునిచె దెలియవలెన్ ॥శ్రీ॥

8. ఎరుకచె భ్రమసిన తరుణంబందు యెరుక యుళక్కనియెంచ
వలెన్మనసు విషయములలో లంబగుచో మరిసద్గురునీతలంచ
వలెన్భుక్తి ముక్తులకు కొరగానట్టి రక్తి విరక్తులమానవలెన్ సంఘము
లోనిజనులకు చిక్కని సరణిగ మెలకువ మెలగవలెన్ ॥శ్రీ॥

9. జననమరణముల క్లేశము బాపగ జాలిన మార్గము తెలియండీ
మత త్రయంబులు పూర్వపక్షమగు మహాద్వైత మది నమ్మండీ
లోతు తెలిసినా వీడరు దీనిలోని మర్మమును గనరండీ
రామచంద్రునీ బ్రోచిన సద్గురురాయల సతతము నమ్మండీ ॥శ్రీ॥

## 15. ఆనంద భైరవి రాగం - ఆటతాళం

**పల్లవి :**

వినియుందువో, లేక వినకుందువోనేడు

**అనుపల్లవి :**

వినకవిన్నా యెరుక విడచీతివాస్వామీ ॥విని॥

1. హృత్పుండరీకమున యెంతొధ్యానముజేసి,
"ఆగచ్ఛ" యని నిన్ను ఆవాహనముజేసి,
నవరత్నసింహాసనస్థునిగాజేసి,
అర్ఘ్య పాద్యాదుల నర్చించి సేవించి
"ఎరుక భ్రమలలో జిక్కికొంటిని యెంతమాత్రమునిలువజాలను
గురువరాయికబుట్టకుండగ యెరుక మూలముద్రుంపు" మనినా ॥విని॥

2. హరిహర బ్రహ్మాదులందారునీవాని,
మూర్తామూర్తములెల్లా గుర్తింపనీవాని,

ఖండాఖండములలో గలవాడవీవాని,
సచ్చిదానందాల సర్వస్వమీవాని
అన్యమెరుగక నిన్నె నమ్మి యనన్యభక్తితొ యెంతొ వేడిన
అన్నె ముపున్నెము యెరుగని నన్నిటూ వేధింతు వేలా ॥విని॥

3. ఎరుక జగములు రెండు ఏకవస్తువెయంచూ
"ఏకమేవా" యున్నదీ యర్థ మేనంచు
గురుశిష్యులిర్వురిలొ గుర్తొక్కటేయంచు,
అదియే మహావాక్య లక్ష్యార్థమనియంచు,
నీవెనేనూ, నేనె నీవని నిశ్చయపుటేకాంత భక్తికి
ద్రోవదారుకక పోయే దేవబ్రోవవే వేగవచ్చి ॥విని॥

4. కర్మమార్గము అంతఃకరణశుద్ధికి త్రోవ
భక్తి చేయగ మనసు రక్తిగనిలచును
జ్ఞానమార్గమున నిశ్చయమౌను పరమాత్మ
అదివీడ శూన్యమున నణగి తిరిగివచ్చు
తిరిగిరానీ పూర్ణయోగము గురువరా బోధించరావే
శరణుజేసిన రామచంద్రుని కరుణనేలిన రాజయోగి ॥విని॥

## 16. మధ్యమావతిరాగము - ఆదితాళం

**పల్లవి :**

కనుగొనగలవా జీవా

**అనుపల్లవి :**

ఘనబోధోక్త స్థితినీ ॥ కనుగొనగలవా జీవా ॥

1. కర్మ, భక్తి, జ్ఞానంబుల వీడి మంత్ర, యోగ, ధ్యానంబుల మాని
ఉన్నబయలునాసున్నయెరుకయని అన్న మాత్రమున యధికుడ వేనా

2. సాధనలన్నియుచాలవ్యర్థమని । పూర్ణగురువు నీకు పూజచాలునని
తనుమన ధనములు తనకేయిమ్మని బోధచేసెటీ బాధ గురులచే

3. రెంటికింజెడిన రేవడి రీతిగ । ఎరుక జగంబులుయెన్న స్వప్నమని
బయలదొక్కటే పరమమేల్కయని ఊహమాత్రమునయువ్విళ్ళూరా ।

4. ఎరుకనయేదో, యెటులబుట్టెనో । ఏడబోవునో, యెటులవీడునో
యేమితెలియకా, యెరుక శూన్యమనియెంత గొణిగినా, ఏమి, ఫలమురా

5. "వేదశాస్త్రములు వివిధ విద్యలు । ఏమి ప్రమాణములేనుచేసినవే"
అనివాదించెదవందలిసత్యము ॥ సమన్వయించగ జాలకనేగా ॥క॥

6. "అచల పూర్ణుడను అశరీరుండను । లేనివాడనే లేక జేసెదను"
నేనెయబద్ధమునేను జేసినవి । నిక్కములెట్లని నీల్గినంతలో ॥క॥

7. చలాచలంబులు సద్గురుచేగని । ఎరుకై నిల్చుట యెరుగకనే
బయలుకు బయలౌపరమగోప్యమున బయలు శూన్యమని మ్రగ్గకనే

8. దీక్షితసిద్ధాంత దేవమార్గమున నిజగురురూపము నెరుగుమురా
రాజయోగి గురురాచబాటలో రామచంద్రువలె రయమునరారా
॥ కనుగొనగలవా జీవా ॥

శ్రీ నిజానంద పోలోజు వీరయ్యాచారి కృతం

## 17. కేదారగౌళ రాగము - ఆదితాళం

విడువజాలకే । మనసా గురుచరణములను ॥విడువజాలకే॥

1. విడువవలదు చూడమెట్టీ । యిడుములధికమైనగాని
ఝుడియబోకు సంబాధలు । బడిననుసతిసుతులెల్లను
విడినను అరఘుడియైనను ॥విడువజాలకే॥

2. క్షితిగృంకిన రవిచంద్రులు । గతులుదప్పి నడచుచుండిన
గతములై కులధర్మంబులు । మతములు జెడిపోయిన
సద్గతి దూరములయ్యిన సరె । ॥విడువజాలకే॥

3. మిన్ను విరిగి పడితారలు । మీద వ్రాలినవ ఖండము
లన్నియు జలమయం బులయ్యి । యున్నను యెవరన్ననుకా
దన్నను ఛీయన్ననుసరె ॥విడువజాలకే॥

4. వేదంబులనృతములైన । నాదబిందుకళలు మీరిన
మోదముతో రాజయార్య । పాదంబులెనమ్ము
మియింకే దెట్టులనైనను సరె ॥విడువజాలకే॥

5. చావైనను పెండ్లయినను । సరెవీరేశుండనకను
యేవిధి బిలచినగనిసరె । వేడుమిగురుకీర్తనములె
పాడుమి బ్రహ్మము గురువని ॥విడువజాలకే॥

## 18. శంకరాభరణ రాగము - ఆదితాళం

1. పదుపదుమిగ గురుసన్నిధికిదిసా । మయమనిసుజనులు
సదయులైరి । నిజ పదవినిగనిరీ ॥పదుపదుమిగ॥

2. పెం పేలను సంసారము । లంపాటము దీని భ్రమ
దెంపవేలా । మదికింపుచాలా ॥పదుపదుమిగ॥

3. మహోర్భటమీలేనెరు । కాహోన్నైతోచిన ।
మోహోమిడవూ । వృధా । దేహోమనవూ ॥పదుపదుమిగ॥

4. ముద్దూసుమి యాబోధకు । నెద్దిసరిరానిదని
పెద్దాల నిరీ । మది । కద్దికనిరి ॥పదుపదుమిగ॥

5. వాటామగు గురుమంత్రం । తోటిలవ్వాడితివ
దాటగలవే । యిది । నీటువినవే ॥పదుపదుమిగ॥

6. లేదుయిగజన్మంబని । ద్వాదశి నిదలువునిజ
బోధవడశీ । బయ లేదొదెలసీ ॥పదుపదుమిగ॥

7. వున్నాననియిాలేనెరు । కెన్నో గనిషోడశిలొ
సున్నాయగదా । గురు । తన్నా పరదా ॥పదుపదుమిగ॥

8. పొన్నాలరాజయ్యా । ర్యన్న చైతన్యమును
గన్నావాయె । అది । వున్నా నీవే ॥పదుపదుమిగ॥

9. కలసామ్యంబీమేనని । పలికె వీరాచార్యులు
పలుకువినుమా । దీని । ఫలముగనుమా ॥పదుపదుమిగ॥

## 19. కళ్యాణి రాగము - ఆదితాళం

1. అన్న లారనొకమన విజేసెదను । ఆలోచించి వినరండీ
విన్న విమర్శన జేయక దూరితే । నిదిమర్యాదయుగాదండీ ॥అ॥

2. చదువుశాస్త్రములుచదివినమనుకొని । బెదిరించుట పలమేమండీ
చదివిచదివి చాలించిన వారికి । చదువులతో పనిలేదండీ ॥అ॥

3. తనువుతో మోక్షముగలదని దెలిపితె । తనమదినమ్మకమెట్లండీ
పరిపూర్ణంబిదెగనుమాయనెమా । గురుబోధట్టుల లేదండీ ॥అ॥

4. మంత్రయంత్రములు మాయమహత్తుల మాటమాకుసరిపడదండీ
తంత్రయోగసాధనములు జేసితె । తానే మాయెనొతెలుపండీ ॥అ॥

5. తనువుకు మూలముతల్లిదండ్రులని । తలపోయుటనదిగా దండీ
తనకుతానెతల్లిదండ్రులటంచును । వినిపించిరి ఘనబుధులండీ ॥అ॥

6. అంగములో పరమాత్ముడున్నడనె । భంగులమాట విడువండీ
దొంగగురువులకు అచలంబున్నది । దోచకనే చెడిపోయిరండీ ॥అ॥

7. మనము జనించినియేదెరిగెతె । మనకదితప్పనుటే మండీ
ఘనులెవరైనను దెలిసితె వారల । కన్నులగానరిదేమండీ ॥అ॥

8. ద్వాదశిషోడశిబోధవడసితె । వాదభేదములు లేవండీ
సాధులమనిసొరాదులు బెంచితే । జగమెరుకల భ్రమబోదండీ ॥అ॥

9. జ్ఞానమెరుంగక జ్ఞానులమనుకొని । ఘనతవహించుటత గదండీ
జ్ఞానాజ్ఞానము రాజయార్యుల । జేరివిని భ్రమ విడువండీ ॥అ॥

10. వున్న దెవున్నదియెప్పటికెడతెగ । కున్నదానిలోలేమండీ
యెన్ని దెలిసిన వీరచార్యులను । కున్న దెస్వప్నంబాయండీ ॥అ॥

## 20. శంకరాభరణ రాగము - ఆదితాళం

నరుడనగుబాటు పాలుగాకు । ముందు । మరణమున్నాదియింత
గురుతైనలేదనీకు ॥నరు॥

1. దరిజేరనివనివృధా । తరక శాస్త్రములు జెప్పు । గురువూల పంచ జేరబోకు । సత్య । పరిపూర్ణ బోధ దెలియుటాకు । నిజ । గురు సాంప్రదాయమిదువబోకు । దురహాంకారంబునమ్మి । నరకంబు లోనబడకు ॥నరు॥

2. యజ్ఞయాగములు జేసితివి । నీదు । ప్రజ్ఞాకొజనులుజూచి । ప్రఖ్యాతి జేయుటకొ । విజ్ఞానిననుచుజెప్పి । వెర్రిభ్రాంతిలో జిక్కి సుజ్ఞానినను చుమురిసితీవిసాక్షి । ప్రజ్ఞానమరయకపోయితీవి నా । యజ్ఞానము బోతె మోక్షమంటివదేమి తెలివి ॥నరు॥

3. కదలానిదొకటిగలదుచూడు । దాంట్లొ । కదిలేదిగలిగెదాన్నిగని పెట్టరాదనేడు । మొదలెరిగి త్రవ్వమనుచు । బుధులంత జెప్పినారు అదియే మొతెలియకుంటె కీడు । దీని । విధమెరిగినంతలోనలేడు యిది పరమ రహస్యమౌనుచూడు । యెదువరకు దెలియకున్న । నిదిబాధానీతోడు ॥నరు॥

4. పొన్నాల రాజయార్యమాట । ముందు । విన్నావాలేదొయిపుదు వినరవరహాలమూట । వున్నాదె అచలమంత నాట । లేకనున్నావు నీవు దాంట్లొ నాట । తెలుసు । కున్నయిగతిరగిపుట్టవాట పన్నూగ వీరచారి । కెన్నొబోధించెనాట ॥నరు॥

## 21. మాయమాళగౌళిరాగము - ఆటతాళము

1. యెంతమోసము జేసెరా । యీ మాయయెరుక । యేడలేకనెతోచెరా । వింతగను ఆకాశమందున । అంతరేంద్రియములు జనించికొంత వ్యష్ఠిసమష్టిజ్ఞానము । కింత మూలము లేకపాయెను ॥యెం॥

2. వాయువగ్ని జలంబులూ । తలలేని మొండెము । లాయెనిలభూతంబు లూ । వేయువిధములు విమర్శించిన । కాయమింద్రియ విషయ సంఘము । మాయనేఆకాశభూతము । నచలమని భ్రమియించినట్లూ ॥యెం॥

3. యేడుచ క్రములెరిగితీ । అధిపతులవర్ణములేడగానకపోయితీ ।
వేడుకతా కుడియెడమలనుజత । గూడిఆడెడిపరమహంసను ।
జాడదెలసిన ముక్తికాంతకు । కీడువచ్చె నిదేమిమహిమ ॥యెంత॥

4. నేనె బ్రహ్మంబనుచునూ । మహావాక్యములుగని । లేని భ్రాంతిలొ
మునిగెనూ । నేనుమేనులు వొక్కటయ్యి । నేనుజేసినవేదములు
గని । నేను మురిసితిగానిమృషగా । నేనుదెలియక పోతినయ్యయో
॥యెంత॥

5. పిండ బ్రహ్మాండంబులూ । యీరెంటిలోన । నుండెగద రెండ
హములూ । ఖండములు నాల్గయ్యి యెరుకయ । ఖండ రూపంబయిన
రెంటిలొ । రెండుదీసితె రెండుమునిగెను । నుండు నదియిగయే
మొనవలా ॥యెంత॥

6. ధరణిలో బహుజూచితీ । పొన్నాల రాజయ । గురునిసన్నిధికేగితీ ।
పరమపదమును జూపుమనినే । శరణుజొచ్చితి తిరిగిరమ్మనే ।
తిరిగితినినాలోనె నన్నె । నరయవంధ్యాసంతునైతి ॥యెంత॥

7. రామసాగరమందునూ । యీవీరచారి । క్షేమముగనివసించునూ
రామసాగరమనగనేదొ । రామసాగర మెరగిపోయితె । యేమొ
నేనైతెరుగనావలి । దీవలనెలేకుండబోతి ॥యెంత॥

## 22. నాదనామక్రియ రాగము – ఆటతాళం

1. చూడబోదమువస్తారమ్మా । లెస్స ఆడేటిగారాడి వాడొచ్చెనమ్మా
చూడబోదమురారె సుదతులుగంధర్వా । మేడనగరపు
గొడ్డూ చేడియకొడుకాట ॥చూడ॥

2. రజ్జుసర్పము దొడ్డాదమ్మా । యెంత । పూజ్యులయ్యిన దానీబొగడ
లేరమ్మా । ముజ్జగంబులు దానిమోముకే భయపాడియిజ్జగములొ
ప్రాణమిడచీరి కొందారు ॥చూడ॥

3. దారుపురుషుడు వాని కొడుకూ । యెంత । ధీరుస్తుడే చూడాతెలి
యాని వరకూ । శూరత్వమునశశీ శృంగా యుధము తోటి ।
జీరిఫలములస్తులేరిపంచెసూను ॥చూడ॥

4. యెండమావుల పరివాహమున । గొప్పా । గండిబోయినచెరువు
నిండించులలనా । బండమీద పంట బండించి క్షుదహీనా ।
ఖండనిర్దేహుల కన్నంబులిడునాటా ॥చూడ॥

5. రావేవేగిరముబోవలయు । ప్రొద్దు మీరిపోయితె ఆటదీరు
అవలయు । కోరిపొన్నాల్ రాజయార్యుచె వీరయ్య । యీరీతి
వినెనాటయిది యేమిరహస్యాము ॥చూడ॥

## 23. శంకరాభరణ రాగము - ఆదితాళము

1. ఆలోచనయింకెందుకు జేసెవు । చాలుచాలురోరి
మూలము లేని శరీరంబిదిగురు । మూర్తి జేరురోరి ॥ఆ॥

2. యెందుకు జననంబైతివోనీవు ని । న్నెరుగవేమిరోరి
ముందు యెవరో నీమూలము । దొరికితె ముక్తి దెలుసు రోరీ ॥ఆ॥

3. ముని పే|బ్రహ్మ విష్ణురుద్రులకు । మూల మేదిరోరీ
మునులు దిగంబరఋష్యాదులు । మునిగిపోయిరోరీ ॥ఆ॥

4. శతసంవత్సరములకంటెక్కువ । బ్రతుకరెవరురోరీ
మతవాదంబులొ కీచులాడితె । మృతిదప్పదురోరీ ॥ఆ॥

5. కలలో వచ్చిరి రాజులు మంత్రులు । గజములెన్నొరోరీ
నిలువలేవు నీమేలుకలోపల । నెరుగ వేమిరోరీ ॥ఆ॥

6. నేను బ్రహ్మమను అహంకారమును । నిలువనివకురోరీ
నేనునీవనని యచలంబెరగితె । నిలువలేవురోరీ ॥ఆ॥

7. చచ్చెదనుక శాస్త్రాలుజదివిన । చాలుగావురోరీ
యిచ్చుతోడ యీబోధ గొంటివ । యెరుక లేదురోరీ ॥ఆ॥

8. అన్ని మంత్రములు వుత్తదిజేసెటి । దచలమంత్ర మోరీ
తిన్నగ యీగురు బోధవడిసితె తెలివి శూన్యమోరీ ॥ఆ॥

9. ధరణిలోన పొన్నాల రాజయ్య । గురునిజేరురోరీ
మరలజన్మ మిగయెత్త బోవుయీా । మరుగుదెలియుమోరీ ॥ఆ॥

10. కలతలేదు యీా వీరచారియను । పలుకునమ్మురోరీ
బలిమిచేత తినుమనపులివల్లని । పాటియౌనురోరీ ॥ఆ॥

## 24. బేహాగ్ రాగము - ఆదితాళం

1. దరిశనమాయెనుగా । శ్రీసద్గురుమూర్తీ । దరిశనమాయెనుగా ॥
దరిశనమాయెనుధన్యుడనైతిని । పరిశమునోకిన పసిడివిధంబున ॥

2. జనన మరణములనణ చెటిబోధను ।
వినయముతోడుత గనజేసెటి గురూ ॥ ॥దరి॥

3. కలగని పలువిధ కలవరపడగను ।
చులకని యుక్తిగ కలమేల్ కొల్పెటిగురూ ॥ ॥దరి॥

4. క్షేమంబిదెనానోము ఫలించెను ।
యేమిలేవనుచు ప్రేమదీర్చె గురూ ॥ ॥దరి॥

5. పున్నమ చంద్రునిబోలు ప్రకాశమౌ ।
పొన్నాల రాజయ్యా పుణ్యమూర్తి గురూ ॥ ॥దరి॥

6. భూజనములో పోలోజు వీరయా ।
యీా జన్మము తరియింపగ నిజగురూ ॥దరి॥

## 25. తిలకామోదురాగం - ఆదితాళం

1. నమ్మవలదు నమ్మవలదురా । యిదిలేని యెరుక
నమ్మ వలదు నమ్మవలదురా ।
నమ్మవలదు లేని యెరుక యిమ్మహిలొ నొకకమ్మ గుడిసె ॥
సుమ్మియిది నిలువదు తోల్‌బొమ్మలు మాయమ్మవినుము ॥నమ్మ॥

2. వేదశాస్త్రములను వ్రాసి వాదములక మోదపరచి ।
భేదము శివజీవులకును గాధలు గలుగజేయుచుండు ॥నమ్మ॥

3. లేదదియెంతొవెదకిన కాదదినీచేదెలియను
జూదరితనమందు ద్రోసిబాధలుగలుగ జేయుచుండు ॥నమ్మ॥

4. వింత వింతలైన వివిధ భ్రాంతులాకు పట్టణమై
నంతలోన దీనిమూలమగుపడదెటు జూచుటాకు ॥నమ్మ॥

5. కూటికొరకు లేనిపోని బూటకవేషములు గట్టి ।
సూటిగతన్నెరుగనివని నీటుచెజెడిపోవుచుండు ॥నమ్మ॥

6. పొన్నాల రాజయార్య సన్నిధానమందు జేరి ।
గన్నవారు వుత్తదేయని సున్న జేసియున్న దాన్ని ॥నమ్మ॥

## 26. శంకరాభరణ రాగము - ఆదితాళం

1. లక్షణముతొ మీరెరిగితిరానొక లక్షణమును వినిపింతునయా ।
అక్షయబోధస్థితి గల పెద్దల కనుదినమును మెప్పైనదయా ॥లక్ష॥

2. బుద్ధిమంతులగువారలకెల్లను ముద్దైతో చినసుద్దులయా ।
బద్దులెరుగరెట్లన్నను అంధునకద్దంబొసగిన చందమయా ॥లక్ష॥

3. మనమందరమైతెను మును లేకనె మనకు మనమెచను దెస్తిమయా ।
మనమెవ్వరొమననెరిగెటి దొక పనిమనకుమాత్రమిక గలిగెనయా ॥లక్ష॥

4. మున్నుకృష్ణదేవునితొ పార్దుడతిమోదంబు తొవినికన్నదయా ।
వున్నదిపరిపూర్ణముదానిలొలేకున్నవు నీవనితెలిపెనయా ॥లక్ష॥

5. లేనివారలున్నారుయనిన యీ మానవులకు నాశ్చర్యమయా ।
జ్ఞాననేత్రములు వికసించిన యీకలతవాక్యములు మానెరయా ॥లక్ష॥

6. షోడశికాంతులు లేని బట్టబయలేడగలదొదాని జూడదయా ।
వేడుకతోడను దెలిసి మీరు షోడసిమంత్రార్థము వీడరయా ॥లక్ష॥

7. పొన్నాల్ రాజయార్యుజేరకుంటెన్నాండ్లయినను దెలియరయా
వున్నంతను దెలిపిన వాస్తవ్యముగన్నను తప్పేమున్న దయా ॥లక్ష॥

8. కోటి యజ్ఞములు కోటి సాధనలు యేటికి పారినవుదకమయా ।
చాటినాడు పోలోజు వీరయాచార్యులు మీమది నాటనయా ॥లక్ష॥

## 27. కన్నడరాగము - ఆదితాళం

1. అన్న లారమనవినుమా । యన్నలార మనవినుమా ।
అన్న లార మనవిదె నాచిన్నదొక విన్నపంబు ॥ అన్న॥

2. వున్నదె పరిపూర్ణము లేకున్నదె నేనీజగతీ ।
తిన్ననీ బోధను వినికనుగొన్ననూ గోచరమగుమా ॥అన్న॥

3. జీవశివులననొకటె భావమందున జూడ ।
కేవలాత్మను కనుగొనలేవీ రెండెన్నడువౌ ॥అన్న॥

4. జననమరణంబులానె ఘనవారధి దాటుటకిదె ।
అనువైన బోధ దీనిగనుడీ గురుకరుణవలన ॥అన్న॥

5. తనుమనధనములొ భ్రాంతిలొ మనముండుటదగునా చీ ।
యనిరోసియు పెనుమాయనుదును మాడుటసమయమిదె ॥అన్న॥

6. వేదము వేదాంతమునకు ఖేదంబేమియొకనుగొని ।
ద్వాదశిషోడశి మంత్రము శోధింతము పాదునుగని ॥అన్న॥

7. యెన్నాండ్లుండెదమిహములొ కొన్నాండ్ల సుఖమేకద ।
పొన్నాల రాజయార్యుల సాన్నిధ్యము జేరుదమిగ ॥అన్న॥

8. సాలోక్యము సామీప్యము యీ లోకములోనివెకద ।
పోలోజువీరచారి నాలోచించియు పలికెను ॥అన్న॥

## 28. తత్వము - త్రిపుటి తాళం

సంశయమెందుకుపదవే నిజగురు సన్నిది జేరగ మనసా
హింసలకాధారంబౌ నిహసుఖ । మిదిశాశ్వితమౌ మనసా ॥సం॥

మత గురువుల నమ్మితివాయిగ । సద్గతి గననేరవు మనసా ।
సతతముసద్గురు పాదమునమ్మితె । గతి సద్గతియౌ మనసా ॥సం॥

వుపవాసవ్రత జపతపములలో । వుపమేమెరుగెవు మనసా ।
విపరీతంబౌ లోకులనడకలు । అపరాధంబులు మనసా ॥సం॥

నీకు జనించినలోకములోకుల । నీవదిగాంచవు మనసా ।
నీకాతీతంబున్నది కనుగొన । నీకదిప్రళయము మనసా ॥సం॥

నిగమాగమములు బలికెను బ్రహ్మము । నీవేనేనని మనసా ।
మొగుడులేని ముత్తైదతనమునకు । మురియుటమేలా మనసా ॥సం॥

పన్నెండక్షరముల మంత్రంబును । పఠియింపగదే మనసా ।
తిన్నగ పదహారక్షరముల । యెరుకెన్నడులేదిగ మనసా ॥సం॥

యెన్నాండ్లుండిన నిలువవు నీకది । నిశ్చయమేకద మనసా ।
పొన్నాల రాజయార్యుల జేరి । పరిపూర్ణబోదగను మనసా ॥సం॥

బంధమోక్షములు భ్రాంతిరహితులకు । ముందేలేవని మనసా ।
చందమెరిగి పోలోజు వీరయా । చార్యులు దెలిపెను మనసా ॥సం॥

## 29. తత్వము - ఆటతాళము

యేమిదెలుపుదు గురుని మహిమ । యెంతనీ వర్ణింతునే ।
యేమిలేదని చూడుమనె । నాకేమిదోచక పాయెనే ॥యే॥

భూతినుదుటను బూసి । బ్రహ్మ వ్రాత దూడిసి వేసెనే ।
ఖ్యాతిగా నిర్మూలమౌమని । కరము శిరమునమోపెనే ॥యే॥

లేనిదొక్కటిమేను జగముల । తోనునిజమై తోచెనె ।
నేను మేనులు జగమునీకల । లోనివని బోధించెనే ॥యే॥

వేడుకతొ సద్రూపమేబహు । కీడుజేయుచునుండెనే ।
వీడుమనిదయజేసి మొదలే । మూడుమాటలు దెలిపెనే ॥యే॥

ధరణిలొ పొన్నాల రాజయ । గురుని సత్కృపగలిగెనే
యిరవుతో త్రివిధ ప్రసాదము । లిచ్చి రక్షణజేసెనే ॥యే॥

సత్యముగ పోలోజువీరయా । చార్యులిట్టుల దెలిపెనే ।
నిత్య నిర్మలమైన బయలున । నెరుక బుట్టగలేదనే ॥యే॥

## 30. తత్వము - ఆటతాళం

మనసుల్లొరుఖల్ ఝల్ । మాటల్లొగుల్గుల్లు । మరిమారికల్పించెరా
ఈలేని యెరుక । మహిమలెన్నొ నేర్పించెరా ॥మన॥

కులమతవర్ణములు మోపి । గొప్పకురచ జేసింది ।
తీర్థయాత్రలెల్ల దింపి । దిమ్మదిరుగ జేసింది ।
జోగివాండ్లజేసి కొంత । జోలెచంక కేసింది ।
జడలు బెంచి కొందరికి । మెడలొపూసలేసింది ।
బాసలేమొజేయించి । భ్రాంతిభయములుంచింది ।

ఆశలెన్నోబెట్టి । జనుల అడవిపాలు జేసింది ।
దేవభ్రాంతి పెట్టికోట్ల । జీవహింసజేసిందిరా ।
యీమాయ యెరుక ప్రాణి హింసచేస్తుందిరా ॥మన॥

అంగలింగ మెరుగకుండ । లింగదార్ల జేసింది ।
స్వామి మహిమ దెలియకుండ । నామదార్ల జేసింది ।
నిజము దెలియజాలకుండ । భుజము లేమొకాల్చింది ।
జగమెరుగని వారలకు । జంధ్యమూలు వేసింది ।
సంధి దెలియలేనివాండ్ల । సంధ్య వార్చ బెట్టినది ।
సౌంజ్ఞదెలియ నట్టివాండ్ల । కృజ్ఞమాలు బెట్టింది ।
బుద్ధిహీనులైనవార్ని । బోడితలలు జేసింది ।
జ్ఞానహీనులైవాండ్ల । కర్మమోడిగట్టిందిరా ।
యీ మాయ యెరుక । పాపమోడిగడ్తుందిరా ॥మన॥

పాతకములు బోవుననుచు । భజనలు జేయిస్తుంది ।
ముద్రలన్ని బట్టజేసి । మోసమొందజేసింది ।
జడమతులగు వారలనుచు । జపములు జేయిస్తుంది ।
హృదయమందు నానివాసముందుననుచు దెలిపింది ।
అష్టదళపద్మము వరకు । అందరిని నిలిపింది ।
సృష్టికాదిసాక్షియైన । ద్రష్టనునేనన్నాది ।
గగనమందు మెరసినట్లు గనుపించిపోతుందిరా ।
యీలేనియెరుక మాయమయ్యిపోతుందిరా ॥మ॥

జీవశివుల వేరుజేసి । దేవులాట బెట్టింది ।
జీవశివైక్యంబుజెప్పి । సావధానపరచింది ।
క్షితిలొతన్ను నమ్ముకొరకు । శృతుల జేసి పెట్టింది ।
తన్నుతాను దెలియకుండ । తగువులెన్నొ నిలిపింది ।
లేనిపోనివన్ని వ్రాసి । కానిపనులు గోరింది ।
దానివంటి కల్తివాండ్ల । దాన్ని నమ్మజేసింది ।
పొన్నాలరాజయోగి । పూర్ణగురుని సేవజేసి ।
పోలోజు వీరచారి బోధబడయ జేసిందిరా ।
యీ మాయయెరుక శూన్యమయ్యిపోతుందిరా ॥మ॥

# 31. జోలపాట

జోరాజయోగీంద్ర జోదేశికేంద్రా । విజ్ఞానఘనసాంద్ర । విబుధామరేంద్రా ॥జో॥

1. ఆకాశ నగరిలో నపరంజిమేడామేడలో స్పటికంపు మేలి
ముయ్యాలా త్రిగుణాలు పొదిగిన దివ్యమౌపాన్పు
కలలేని సుఖనిద్రగాంచు మాస్వామీ ॥జో జో॥

2. యుగయుగాలుగ నీవుజగతిలో గూడీ భవనాశస్థితులలోపాట్లు
పడినావూ ఇదియేమి ఆటయో । యిదియేమినటనో
చాలడస్సితివింక విశ్రాంతి గొనుమూ ॥జో జో॥

3. ఆయురారోగ్యసంతాన సంపదలూ బలరూపవిద్యలూ ప్రజ్ఞకీర్తు
లునూ తమకివ్వలేదంచు తగనీర్ష్యజనులూ
నిష్ఠురోక్తుల నిన్ను నిందింపనేలా ॥జో జో॥

4. కథచెప్పి నిద్రనూ గల్పింపగలనా అన్ని కథలకు నీదె ఆది
కథకాదా గానరసమూ చేతగల్గునానిద్రా
రసమెనీవైయుండ రసమేడదెత్తూ ॥జో జో॥

5. బూచివానీ భయముదోచునోయంటె బూచులకు తాచులకు
మొనగాడవీవే కాని తెలిసెను స్వామి కలదొక్కనిజమూ
నీమోహమునటు ద్రిప్ప నిలుచునాగుర్తూ ॥జో జో॥

6. పొన్నాల వంశాబ్ధి పూర్ణచంద్రుడవూ
కనుకనే రాజయాఖ్యను చెందినావూశరణన్న భక్తులాకరుణతో
బ్రోచివర । "శ్రీదయానంద" బిరుదొందినావూ ॥జో జో॥

7. అచలఋషి శ్రేణిలో యవతరించావూ విజ్ఞానఖనివౌచు
విలసిల్లి నావూ దీక్షి తాచలగురూ దివ్య పీఠమునా
అధ్యక్షస్వామివై అలరానినావూ ॥జోజో॥

8. మాయమ్మ అనుసూయమాంబ నిను గొల్వ
రామచంద్రుడు సీత రమణితోగూడీ జేజేలు గొట్టుచూ
చేరిభజియింపాకలబాసికనుమూసిగాంచుమాసుఖమూ ॥జోజో॥

# 32. మేలుకొల్పు

1. మేలుకొనవెనిజగురుండనే । మిహిరుడుదయంబౌచునుండెను
శీలులైజనులంత జాగ్రత । జెందిరదిగొసుమీ ॥ఆత్మామేలుకొనవె॥

2. కండ్లకునుబలధనములనెపోర । గప్పి గర్వముచేత పెద్దల
కండ్లగానకపోతిబూరుగు । పండ్ల భ్రమజూచీ ॥ఆత్మామేలుకొనవె॥

3. వచ్చితివిగురుమూర్తితోనొక । ముచ్చటాడి పొయ్యెటందుకు
తుచ్ఛపనులలో ప్రొద్దుబుచ్చితె । మెచ్చురెవరు సుమీ ॥ఆత్మామేలు॥

4. ప్రొద్దు జరిగెను బాలయవ్వన । వృద్ధవంబుసమీపమాయను
బద్ధమతివై మరచితివిగురు । వద్ద జేరవలెన్ ॥ఆత్మామేలు॥

5. శుద్ధితో గురుమూర్తి పాదము । నద్దిపూజలు జేయవలెనని
బుద్ధిబొడముచునున్నదిప్పుడు । సిద్ధమగుదుసుమీ ॥ఆత్మామేలు॥

6. పుట్టిచచ్చెటి తనువు యెరుకల । పుట్టకుండగముంచి వేయగ
దిట్టమౌగురుబోధగనవలె । తెలివిబొందుసుమీ ॥ఆత్మామేలు॥

7. నేను మేనులు లేని అచలము । లోననేనని పలుకుచుంటివి
లేని యీయపవాదమెక్కడ । దోనెరుంగవలెన్ ॥ఆత్మామేలు॥

8. వున్నదేమొ లేనిదేమొ । వుండజూచెటిదనుకనేనై
యున్న దానవే జననమరణము । లున్న వగునుసుమీ ॥ఆత్మామేలు॥

9. యెంత జెప్పిననీకు మూలం । బింతయైనను లేక వచ్చిన
గంతకంబువెగురునిచే నిజ । మంతదెలిసెనికన్ ॥ఆత్మామేలు॥

10. విన్న వా అనుమాన భూతము । నిన్నుబట్టి ద్రిప్పుచున్నది
పన్ను గనుగురుకరుణ సోకితె । పారిపోవుసుమీ ॥ఆత్మామేలు॥

11. తన్నె రుంగని వివిధ విద్యల । నెన్నియో నేర్చితివిగనివక
టన్ననిలువక యడవిగాచిన । వెన్నలాయెసుమీ ॥ఆత్మామేలు॥

12. పుట్టితివిస్వకృతస్వబుద్ధిగ । బట్టితివి గురుమూర్తి చరణము
పట్టువిడువకపోతివానీ । కష్టములు దొలగున్ ॥ఆత్మామేలు॥

13. వాదబేధములేదు నిరతము । ద్వాదశాక్షరితరచుచుంటివ
లేదు జన్మము మళ్ళియిక గురు । బోధ దెలియుసుమీ ॥ఆత్మామేలు॥

14. షోడశాక్షరిమంత్ర మెప్పుడు । చూడుగుర్తెరిగే శరీరము
తోడ బ్రహ్మ భ్రాంతి యనెటిన । వాదమునిగెసుమీ ॥ఆత్మామేలు॥

15. అందమగుపొన్నాల రాజ । య్యార్యచరణము పూజసలిపి
బంధముక్తులు లేని బోధను । బొందవలెను సుమీ ॥ఆత్మామేలు॥

16. కలలొ నెక్కడలేక వచ్చిన । కలిమివేయనివీరచారికి
దెలిపినాడట మాటిమాటికీ । తెలివిబొందుసుమీ ॥ఆత్మామేలు॥

## 33. మేలుకొలుపు

కటకటామోసమాయనూ । మోసమాయెను జీవచూడగ
మోహపాశములధికమాయెను । గాశిజెందగ జేసెనీగతి
కర్మమేమందున్ ॥జీవా మేలుకొనవే॥

కల్పశతకములకన్న మిక్కిలి । కాలమాయను తిరిగిచూడర
అల్పసుఖమనుకలలొమురుయుచు । ఆడుచున్నావు ॥జీవా మేలుకొనవే॥

కోటిజన్మము లెత్తియును । శతకోటి దుఃఖములను భవించిన
నాటిమాటలు దలచుకొంటివె । నాటునీమదికి ॥జీవా మేలుకొనవే॥

యిరువైయొక వెయ్యారునూరులు । జరుగుహంసలు తరుగు నాయువు
హరిహరాదులు వచ్చినిలిపిన । ఆగదీతనువూ ॥జీవా మేలుకొనవే॥

లేనిపోనీ దుఃఖజాలము । లోనబడి చెడిపోవుటెందుకూ
మానయవమానంబులని । నీ మమతలిడలేవూ ॥జీవా మేలుకొనవే॥

నిజగురుండను సూర్యుడిప్పుడు । నిజముగానుదయించెచూడుము
త్రిజగములలో వారుమేల్కని । తెలివిగన్నారు ॥జీవా మేలుకొనవే॥

బట్టబయలును గురుడుజూపిన । నట్టులేకను పుడమియందున
పట్టువీడక గుట్టుమరువక । దిట్టమైపోవే ॥జీవా మేలుకొనవే॥

మాయతనువై మాయతానై । మాయపనులను జేయుచును
మరి మాయతన మర్మంబుగననే । మాయమైపోవున్ ॥జీవా మేలుకొనవే॥

ద్వాదశీ షోడశులనే జలధార । కర్ణములందుసోకిన
బాధలన్నియు దొలగినీవిక । భ్రాంతులొదిలేవూ ॥జీవా మేలుకొనవే॥

భాగవత శ్రీకృష్ణదేశిక । ప్రభువరుండిటు రానెవచ్చెను
వేగగని తనమనధనంబులు । వీడిశరణనవే ॥జీవా మేలుకొనవే॥

పీలుఖానా శంకరుండని । పలిచి ప్రభువరుడేలినాడట
మూలములేనది యెరుకను । ముంచి వేసిరటా ॥జీవా మేలుకొనవే॥

## 34. శ్రీఅమలానంద పాటల పండరినాధకృతం

### రాగం - భీంప్లాసు - త్రిపుట్

ఓహో రాజయోగీ పొన్నాల రాజయోగీ
చల్లగ రావయ్య - దేవా
యుల్లము నీదయ్యామమ్మేలా రాజయోగీ...
ఆర్తరక్షణ బిరుదుగొన్న - అచలబుషివీవే ॥చ॥

1. సత్యలోకముమీద వెలసే - సత్యమూర్తివిగావే సత్యమూర్తివిగావే
నిత్యశూన్యంబైన పీఠమునెక్కి యున్నావా?
దేవా! ఎక్కియున్నావా ॥చ॥

2. యుగ యుగంబులలోన నీవే -
యుండి యున్నావా - దేవా వుండి వున్నావా
జగజగంబుల జనులబ్రోవ - జగతివెల సేవా -
స్వామీ జగతి వెలసేవా ॥చ॥

3. ఏడు దొంతులయందు గంతులు -
వేయునొక తిమ్మీ - చెంతకు జేరుమనెనమ్మీ
మాతనయ్యిదాతనయ్యి - నాతినొదుననే -
తనలో చేర్చుకొందుననే ॥చ॥

4. నాదుబిందు కళలరూపమె - నాది యన్నాదీ -
అందున చేరుమన్నది
వాదభేద రహితమైన - బోధగనుమంటీ
వాదము మానుకొమ్మంటీ ॥చ॥

5. శబ్దమయమీ సృష్టిజాలము - శబ్దమెరుగుమనే -
కేంద్ర స్థానమెరుగుమనే
శబ్ద రహితంబైన దెరిగీ - చలము మానంటీ
మాటలు మాయమగునంటీ ॥చ॥

6. ద్వాదశాక్షరి షోడశాక్షరి ధర్మమర్మములన్ -
దీక్షతా తెలిపి బ్రోచితివా
దాస దాసుల పాలిదేవా ధర్మపరిపాలా!
యుగయుగ ధర్మపరిపాలా ॥చ॥

7. పాటలా పండారినాథుని - పాట విన్నాము -
మాటలు మానుకొన్నాము
సాటిలేనిబోధ మామది - నాటుకున్నాము -
గుర్తును బాపుకున్నాము ॥చ॥

## 35. రాగం - భైరవి - తాళం - రూపకం

ప్రభునీవువినా దిక్కెవ్వరు అభయమివ్వవా ?
పరిపూర్ణ పరంధామ గురూ శరణు శరణయా ॥ప్ర॥

1. ఏమందు జన్మబంధమూ - యెన్నాళ్ళనుండియో
నన్నేదుపించుచుండెనో - రాజరాజేశా
మీపాద పద్మములను విడువ - మేదినిలోనా
కరుణాకటాక్ష వీక్షణముల - గావుము దేవా ॥ప్ర॥

2. పొన్నాల పరశక్షీర జలధి పూర్ణశశాంకా
బోధామృతంబు నొసగీ ననుబ్రోవవేమయా
మొద్దూలనైనదొల్చితిరట ముద్దులొలుకగా
సూటిగను బోధనాటితిరట చోద్యమొందగా ॥ప్ర॥

3. చిన్నారి చిట్టిబాబూ! విన్నాను నీ మొరా!
నిన్నెవరు కన్నరోయీ! నినుబ్రోతు నిప్పుడే
నీ బుద్ధి సుద్ధి భక్తికి నేముగ్ధుడ నైతీ
ధృవచరితవోలె నీ చరితను ధృవముజేతురా ॥ప్ర॥

4. బ్రహ్మాండ భాండనంతములూ బట్టబయలులో
మృగజలము భాతిదోచే మునులేని ఎరుకకే
లేనెరుక బయలునెరిగి నపుడె లేకపోవురా
మేల్కొన్న యపుడె నీకలా మునిగి నటులరా ॥ప్ర॥

5. కర్తృత్వ కార్యకరణములూ గాక నంతటన్
గుర్తేమి లేని బయలే గురు గోప్యమరయుమా
లేనట్టి ఎరుక లేనిదనీ లేక యుండరా
పతిలేని సతీ శూన్యహృదయ భావమువలెరా ॥ప్ర॥

6. దయాంతరంగ దేవా! ధన్యుండనైతినీ
నేలేని వాడనయ్యా! నేనేమి చేయుదున్
అనసూయాదేవి సాధ్వితోడ అందమలరగా
దాసూల బ్రోచుచున్న దయానంద ఋషివరా ॥ప్ర॥

7. ప్రజలారా పండరీనాథుని పాట విన్నారా?
బయలెరుక లెరిగి యెరిగినదీ వదలియున్నారా?
కర్పూర కళిక న్యాయమయ్యె కలతదీరెనూ
పలికేది లేక పోయెనికా పాడునదేమి ॥ప్ర॥

## 36. కన్నడ - ఆదితాళం

వినుమా! ధరిజేర్చుమా! కన్నుల జూచియు కలదీర్చుమా ॥వి॥

1. గురువరనిన్నే నమ్మితినయ్యా! హరిహరుడన్నా నీవేనయ్యా
తరమా పొగడా నరులము స్వామీ ! మురిపెముతోనిక కరుణజూపుమా ॥వి॥

2. తల్లియు దండ్రియు దాతవునీవే చల్లగ లోకములేలుదువీవే
యుల్లము నీకై యుంచితిమయ్యా - వల్లభ బ్రోవగ వడిగరావయ్యా ॥వి॥

3. ధన ధాన్యంబులు కోరము దేవా - తనయులనిమ్మని వేడము దేవా
తనువాదికములు చరమే దేవా - జననములు బాపగ వినతులు దేవా ॥వి॥

4. సాధనలెన్నో చాలునుదేవా - నాదబిందువుల మోదము దేవా
కాదవి మమ్ములగావనుదేవా - వేదవేద్యనీబోధలెబ్రోవా ॥వి॥

5. నేనేకలయని నేర్పుగదెలిపీ – నేనుగాని యాబయలును జూపి
లేని నన్ను లేనట్టుల హారతి – గొనుమా నీకదె జయజయ హారతి ॥వి॥

6. శ్రీ పొన్నాలా రాజేశ్వరప్రభు కాపాడితివా! పండరినాథుని
ఆపగిదిగనే మమ్ముల దయతో శ్రీపతి బ్రోవుము శీఘ్రము దేవా ॥వి॥

## 37. శ్రీరాగం – ఆదితాళం

ఏజన్మ పుణ్యమో యీ జన్మమందునా
పరిపూర్ణ రాజయోగి చరణాలె చిక్కె నేతరియంచజన్మనే ॥ఏ॥

1. శ్రీదివ్య పాదములను సేవించి దీక్షతో సేవించి దీక్షతో
హరిహరుల కసాధ్యమైన పరిపూర్ణబోధనే పరిపూర్ణ బోధనే
వీనులకు విందుగాను వినిజన్మ బంధమున్ కడద్రోసి కొందిలన్ ॥వి॥

2. ఒరులొరులు నేను నేనను అరమరలు లేని యాపరిపూర్ణమందునా
అరుదెంచిఖేదమోదా ఆరాట మందునా చరియించుచుండినా
ఎరుకే పరిపూర్ణ మరసీ మరినిల్వ కేగునే గురుసూచనైతెనే ॥ఏ॥

3. నామంబు రూపక్రియలును ఏ మాత్రముండకన్ ఏమనగ రాకయున్
పుట్టుట గిట్టుటయూలేకను పుట్టించకుండగన్ పొడగాంచ కుండగన్
చుట్టూగ కదలాకున్నది గట్టిగగాంచవే వట్టిదిలేకనే ॥ఏ॥

4. ఎరుకే యీ విశ్వస్వప్నము లేర్పరచుకొన్నది మురియూచు నున్నదీ
తేజోంధకారములను తెరరంగు బొమ్మలాతైతక్కలాటలూ
మృగజలపు భ్రాంతికై వడి మృషయౌను చూడవే నిజమెరిగినంతలో ॥ఏ॥

5. శుశ్రూషలునాల్గుజేసి శుద్ధత్వ మొందియున్ ద్వాదశిని గాంచియున్
షోడశ పూజలును జేసి షోడశిని వీడినన్ సోదెల్ల దీరునె
ఉన్నాదెయున్నది నేనన్నా దెలేనిదే సున్నయ్యి పోయెనే ॥ఏ॥

6. శివరామదీక్షితాచల శ్రీదివ్యబోధలే క్షేమంబు ధాత్రికే
జనులాకుజన్మ మరణపుజడు పెల్ల దీరునేక్షణమాత్రమందునన్
పండారినాథు నట్టులె నిండూగ బ్రోచెనే భయభ్రాంతి బాపెనే ॥ఏ॥

# 38. అ॥ప॥ పూర్ణానంద బాదెరాములు కృతం

1. పొన్నాల రాజయోగి లీలామృత వందనం
దయానంద సాందీప గురు, వందనమభి వందనం ॥పొ॥

2. విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మ వందనం
నిర్విషయ కైవల్యధామ, వందనమభివందనం ॥పొ॥

3. ద్వయదోష రహితమైన పరమపురుష వందనం
స్వప్రకాశచలనరహిత వందనమభివందనం ॥పొ॥

4. ద్వాదశిషోడశి ధర్మమర్మముల వందనం
త్రివిధ ప్రసాదము గురు వందనమభివందనం ॥పొ॥

5. మూడులోకంబుల కతీత పూర్ణ వందనం
పాడుమాయ పారిపోయె వందనమభివందనం ॥పొ॥

6. సత్యాచలపూర్ణ బోధ సాధు రూప వందనం
త్రిపురుషైక పురుష నీకు వందనమభివందనం ॥పొ॥

7. శివరామదీక్షితీయ చరణములకు వందనం
ఆత్మాతీత కేవలాత్మ వందనమభివందనం ॥పొ॥

8. పాదసేవకంకితంబు రామకృష్ణ జీవితం
లేదు లేదుయెరుకలేదు, వందనమభివందనం ॥పొ॥

# 39. భక్తి కీర్తన

1. పూజ్యనీయుడు సాందీపయాఖ్యుని దర్శనమయ్యేనూ
నిజగురుమూర్తిపాదము జ్ఞానేంద్రియముల పూజలు చేద్దామా ॥పూజ్య॥

2. పత్రపుష్పఫలతోయములిచ్చిక పావనమౌదామా
నిత్యంనిజగురుసేవలు జేసినాలోనహమును బాయుదమా ॥పూజ్య॥

3. కారణకార్యము శ్రీగురుమూర్తికి కానుకలిద్దామా
పరమునలేనియెరుకను విడచి జలజపత్రమైఉందామా ॥పూజ్య॥

4. జీవేశ్వరులనైక్యముజేసి పరమునకర్పనజేద్దామా
భవనాశనములేదికమనకని భ్రమరహితంబైఉందామా ॥పూజ్య॥

5. అరిషడ్వర్గాల భిమానములమద్గురుమూర్తికి ఇద్దామా
ధరవిశ్వములోకళనెడబాసి ఏకాంతభక్తిగ ఉందామా ॥పూజ్య॥

6. స్థూలసూక్ష్మమహాకారణములను సద్గురుమూర్తికి ఇద్దామా
మూలములేని శరీరము విడచి ముక్తులమౌదామా ॥పూజ్య॥

7. విశ్వతైజసప్రాజ్ఞల నెరిగి ప్రత్యగాత్మ ప్రభుకిద్దామా
విషయవాసనలు గురుమంత్రములో కాల్చివేసిమనముందామా ॥పూజ్య॥

8. ఆత్మానాత్మ విచారణ జేసినిజగురుమూర్తికి ఇద్దామా
తత్వవిచారణ గురుసౌంజ్ఞలలో సాక్షిని బాసి ఉందామా ॥పూజ్య॥

9. దయానందశ్రీసాందీపయాఖ్యుని ధర్మబోధమనమిందామా
శిష్యుడు బాదెరాములు వ్రాసిన రచనలు వినికనిఉందామా ॥పూజ్య॥

## 40. కీర్తన

పుణ్యభూమి నా దేశం నమో నమామి (అనుమాదిరి)

పల్లవి : పుణ్యమూర్తి నాగురుడు నమో నమామీ
జనన మరణ వ్యధమాన్పిన సాంధిపస్వామీ ॥పుణ్య॥

చరణం :

1. సప్తాచక్రంబులకు మీదను నిలచుండినా
నిత్యం హంసోహమును హిరణ్మయ లీలలునూ
పంచాకోశంబులా సంచును ఈ యెరుకయనీ
అచలపరీపూర్ణములో యెరుక శూన్యమనియన్నా ॥పుణ్య॥

2. నాదబిందు కళశక్తి నటనలు గలి గుండిననా
బిందుత్రయ ప్రత్యగాత్మమూలం బెరిగించెనూ
సర్వత్రనిండియున్న పూర్ణబయలు నిజమనీ
పరిపూర్ణబోధనెరిగి యెరుక నెగరజిమ్మిననూ ॥పుణ్య॥

3. నిన్న నేడు రేపు జగము యెరుక స్వప్నజాలమని
రానిపోని దానిలోన లేని కళమృగజలమనీ
ద్వాదశి శోడశి మంత్రము దానమొసగినాకును
బోధామృత కరుణజూపి అమరత్వంనీవనెనూ ॥పుణ్య॥

4. తనువు మనసు ధనమును గురునకిచ్చియున్ననూ
నేను మేనులహము బాపి ముక్తి దారి జూపెనూ
తేజోంధాకార రహిత అచలోయం ఉన్నదనీ
నిజగురుడెరిగించిన పరావాక్కు సత్యమనీ ॥పుణ్య॥

5. ధరసికింద్రాపురము ధర్మపీఠఅధ్యక్షులునూ
పరాత్పరుడు పరమైన సాందీపయాఖ్యులును
పూర్ణబోధనెరిగించెను శిష్యబాదెరాములనీ
కరుణజూపి భక్తుల కైవల్యదేహమెరిగించెనూ ॥పుణ్య॥

## 41. కీర్తన

అమ్మా అవనీ నేలుతల్లీయనీ ఎన్నిసార్లు పిలచినా తనవితీరదమ్మా (అనుమాదిరి)

పల్లవి : అమ్మా జననీ సంకల్పసృజన కల్పవల్లీయనీ
కమ్మనైన అమ్మమాట వింధ్యమాంబవేదమనీ ॥అమ్మా॥

చరణం :

1. జగము వలన సంకల్పము జగమా సంకల్పమునా
మృగజల మిధ్యాభ్రాంతి జనియించినదీజగమనీ
విక్షేపావరణభ్రాంతి కళపురుషునివిడిపించినా
మీ చల్లని దీవనలెమాకు జన్మ ధన్యమనీ ॥అమ్మా॥

2. పిండాబ్రహ్మాండముల కారణకార్యంబులనూ
రెంటిలోని రెండహములబాపిన శ్రీమాతవనీ
పరమునకు పరమైన పరబయలె ఉన్నదనీ
కర్తృత్వకర్మరహిత కౌషలమున నడువుమనీ ॥అమ్మా॥

3. కాలకర్మ చక్రములపయనించే సోహమనీ
స్థూలదేహమందు జేరిహంసోహంనేనేయనీ
స్థిరమైనది కదలకున్న పరమున లేనెరుకయనీ
శరణుగోరువారికిని కరుణ జూపికడతేర్చినా ॥అమ్మా॥

4. నీకులోన బైట నిండియున్న దెరుగవేమనీ
ఏకాలము ఒక్క తీరు కదలనిది అచలమనీ
గుర్తెరిగె తనవునకు మూలములేదనియన్నా
తిరిగిరాని బాట గురుని నోట విన్నమేల్కయనీ ॥అమ్మా॥

5. భక్తి జ్ఞాన వైరాగ్యనిత్యపూజ లందించినా
ముక్కోటి భక్తులకు ముక్తినిచ్చియున్నవనీ
దయానందసాందీపగురుసహధర్మపత్నిగనూ
శిష్య బాదె రాములుకు పూర్ణబోధమేల్కయనీ ॥అమ్మా॥

## 42. తత్వకీర్తన

1. అక్కడ ఇక్కడ ఎక్కడ వెదకినా దేహమలసిపాయె
నిజగురుమూర్తి దొరికె నాకూ । సాందీపయాఖ్యుడుమనగురుడూ ॥అ॥

2. సాక్షాత్కారం గురుని విడచి నే గుడిలోకెల్లిననూ
గుడిలో శిలయే కనపడెనూ । ఇహపరభోగములేర్పడెనూ ॥అ॥

3. పత్ర పుష్పఫలతోయములిచ్చిన వరములియ్యడాయే
మనస్సున బాధ గలిగియుండె । కళలో వార్తలెకనబడెనూ ॥అ॥

4. కోటి జన్మములు యెత్తిన గాని । సుఖము లేకపాయే
తుద కది దుఃఖము పాలాయే । కష్టము చేయుటమొదలాయే ॥అ॥

5. చేసిన పాపము నదిలో కడగిన । ఫలము లేకపాయె
మన సునమలినం మిగిలుండే । మాయనే కోర్కెలు మొదలాయే ॥అ॥

6. రామేశ్వరము వెళ్ళిన నాకూ । శనిగ్రహ శక్తి విడువకపాయే
నవగ్రహపూజలు మొదలాయే । నన్నే ఏడిపించుటాయే ॥అ॥

7. తత్వవిచారణ గురునిచే విన్నా । యెరుకలేనిదాయె
మృగజల మిధ్యబ్రాంతి బాసే । పరము నిలచియున్నదాయే ॥అ॥

8. ద్వాదశిశోడశి మంత్రార్థంబులా । దానమొసగెయిలలో
గురునీకరుణజూపెమనలా । ద్వయ దోషరహితమాయే ॥అ॥

9. అంతట నున్నది ఆచలంబని । గురుసౌంజ్ఞదెలుయుమన్నా
యెరిగిన యెరుక విడచియున్నా । బయలుకుబయలై ఉందన్నా ॥అ॥

10. దయానందశ్రీసాందీపయాఖ్యుని ధర్మబోధవిన్నా
శిష్యుడుబాదె రాములు మేల్కన్నా । అచలంపరమై ఉందన్నా ॥అ॥

# 43. కీర్తన

పల్లవి : పాహిమాం రక్షమాం సాందీపస్వామీ
అహం రహిత జన్మతరుణ శరణుశరణయా ॥పాహి॥

చరణం :

1. అజ్ఞాన తిమిర జన్మ మేలు కొలిపియూ
ప్రజ్ఞాన స్వప్రకాశ చేతన మందించెనూ
గురుగురు బోధలచేత సాగరమదనంబైన
యెరుకావరణా భంగంబ్రాంతి బాపెనూ ॥పాహి॥

2. శ్రవణ మనన నిధి ధ్యాస లేని దాపూర్ణమనీ
త్రివిధ దీక్షా స్పర్శ జ్ఞాన జ్యోతి వెలిగించెనూ
ఆమంత్రాయుగము దెలిసి ద్వాదశిని దలుపుమనె
యేమీ లేదని పలికె ఈ మంత్రం శోడశని యు ॥పాహి॥

3. మాయా వాసనలు వీడి మౌనిగా యుండిననూ
దేహా వాసనలు వీడి దేవున్ని గనుమనేనూ
ములు మోప సందు లేని అల భద్రాచలమునా
తలపోయ తలపులకు తెలివి శూన్య మయ్యెనూ ॥పాహి॥

4. తన నుండి బయలు పడ్డ యెరుక లేకపోయెననీ
కనుసొంజ్ఞ గురు కరుణ ముక్తి కాంతుడయ్యెనూ
తొలి మంత్ర పర్దము వెదకుటకు ఎందుకనీ
కలదంతట యావలది కదలకనె యున్నదనే ॥పాహి॥

5. లోకంబులు లోకేషులు లోకస్థుల రాకపోకలున్ననూ
యెకాలము ఒక్కతీరు కదలనిది అచలమనే
యెరిగిన యెరుకను మాని యెరుక లేక సేవించిన
ఈరీతి స్థితి గలిగిన నేరుపు శాలితరులనీ ॥పాహి॥

6. శివ రామ దీక్షితాచల దివ్యామృత పీఠమునా
దయానంద ధర్మప్రభు సాందీప యాఖ్యులునూ
శిష్యబాదె రాములుకు జన్మ ధన్యమయ్యెననీ
దాసజనులగాసి బాపే యిల గురు పరమాత్మునీ ॥పాహి॥

## 44. కీర్తన

పల్లవి : ఎగజల్లి నాడే సాందీప యాఖ్యుడెగజల్లినాడే
ఎగజల్లి నాడే ఈ అచల బోధను భువిలో
ఆగమనిగమాముల మధి తార్థ మవ లిదీ ॥ఎగ॥

చరణం :

1. శివరామ దీక్షిత సిద్ధాంత పరము నూ
జనన మరణము లనెడి ఋడుపు దీర్చిన బోధ ॥ఎగ॥

2. జ్ఞాన మార్గము ఋషుల ఏకాంత భక్తనీ
తను మన ధనములు గురున కొసగినవన్ని ॥ఎగ॥

3. తొలి కారు మెరుపాది కళ యెరుక నిలువనిది
పొలు పూగ నీళ్ళందు బుడగాలె దోచినది ॥ఎగ॥

4. నేను మేనుల అహము రహిత పరచియు నన్నూ
ఉన్న దానందున లేని కళ నీవనియూ ॥ఎగ॥

5. ఏడు మేడల పైన ఆటాడె హంసా నూ
ఎండ మావుల భ్రాంతి భ్రముగజల మిధ్యనియూ ॥ఎగ॥

6. సచ్చిదానందాల సాక్షి మూలము దెలిపి
పాచి తీగకు మొదలు దోచినట్టుల దీన్ని ॥ఎగ॥

7. మూడు మాటలు జెప్పి పాడు మాయనుబాపి
కడసారి జన్మకు బయలుండ జూపియు ॥ఎగ॥

8. నవరత్న వాఖ్యాలు సాందీప యాఖ్యుని
కను సౌంజ్ఞ శిష్యాబి రాములుకు మేల్కనియు ॥ఎగ॥

## 45. కీర్తన

(బృందావనమనమందరిది గోవిందుడు అందరివాడేలే అను మాదిరి)

1. బోధామృత పరబయలును దెలిపిన । సాందీపయాఖ్యుడు మనగురుడూ
ఎందుకు నీ కాయితరుల బోధా । తంటలమారిదిభ్రమగలిగుండూ
॥బోధా॥

2. శుద్ధ చేతన సంకల్పంబులో । సృజన చేసిన శ్రీకరుడూ
సాధనలన్నింద్రజాలములనియూ । నిత్యవిచారణలోనుండూ ॥బోధా॥

3. గురువేతల్లియు గురవేతండ్రియూ । గురుడే దైవము తెలసుండూ
ధర విశ్వములో కుమ్మరి పురుగుల । విషయవాసన కంటకనుండూ ॥బో॥

4. జ్ఞానాజ్ఞానమునేనన నొకటనీ । తెలిపెనుమద్గురుమనకిపుడూ
మానవ సేవయే మాధవ సేవనీ । ఇలలో సేవలు చేయండీ ॥బోధా॥

5. క్షరమక్షర కాధార పురుషుడూ । ఉత్తమ పురుషుని కనియుండూ
యెరిగిన యెరుకను గురుదక్షిణగా । ఇచ్చియునీకల బాసిండూ ॥బోధా॥

6. సత్తుచిత్తుయానందములాత్మనీ । సాక్షిమూలంబెరిగుండూ
తత్వవిచారణ గురుసౌంజ్ఞలలో । సాక్షిరహితం బైయుండూ ॥బోధా॥

7. ద్వాదశి శోడశిమంత్రార్థంబులా । దారిజూపెగురుకరుణండీ
హృదయగ్రంథి ముడివిడిపించెనూ గురు । రాకపోకలబాయండీ ॥బోధా॥

8. బయలుకుబయలుగా ఉన్న పూర్ణమూ । బట్టబయలదిగనరండీ
నయముగయెరుకనువిడచియున్ననూ । నైపుణ్యత నీవైయుండూ ॥బోధా॥

9. భక్తిజ్ఞాన వైరాగ్యతత్వమునూ । ముక్తికి పదమనిగనరండీ
భుక్తి ముక్తి క్రియ పూర్ణయోగమునా । ఆచరించెగురుపదమండీ ॥బోధా॥

10. దయానంద శ్రీసాందీపయాఖ్యుడూ । ధర్మపీఠాధ్యక్షుణిగుండీ
శిష్యబాదెరాములు వ్యధను । ఇలలో క్షణమునబాపిండూ ॥బోధా॥

## 46. కీర్తన

పల్లవి : శివుని రూపములోన సాంధీపయాఖ్యుడు
అవనిలోన అవతరించే పూర్ణ పురుషుడు

చరణం :

1. నాలుగు శుశ్రూషణలు లోలత గార్పించాడు
కీలు దెల్పి కర్మకాల్చిజన్మ రహిత పరిచాడు
కారణ కార్యంబులు కళయని యెరిగించాడు
పరమ పదవి ఉండజూపి భావింపమన్నాడు ॥శివుని॥

2. సారా సంసారములకు సాక్షుని యెరిగించాడు
కర్పూర కళిక జ్యోతిక్రాంతిని వెలిగించాడు
జ్ఞానా జ్ఞానంబుల కతీత జేయమన్నాడు
మనన నిధి ధ్యాసములకు అందనిది అన్నాడు ॥శివుని॥

3. శివ రామ దీక్షిత రచనలు గనుమన్నాడు
భవమూల సంహారణ బ్రాంతి రహితమన్నాడు
అరిశడ్వర్గాలను అణచి వేయమన్నాడు
శరణన్న వారలకు కరుణ జూపి యున్నాడు ॥శివుని॥

4. పిండా బ్రహ్మాండములు ఏక రూపమన్నాడు
దండి యెరుకమూలము దృంచివేసియున్నాడు
ఇచ్చారహితంబైన బోధను విను మన్నాడు
ఆచరించి అహంకార రహితుని గమ్మాన్నాడు ॥శివుని॥

5. ద్వాదశి శోడశి దెలిపి దారి జూపియున్నాడు
అద్వితీయ అచల బ్రహ్మ మావలగలదన్నాడు
శ్వాసలేక స్వశక్తి తోటి శ్వాసించాలన్నాడు
పన్నుగ గురు కరుణ తోటి పారిపోతదన్నాడు ॥శివుని॥

6. తికమక స్వర్గంబునకు తిప్పలున్నదన్నాడు
ఏకాంత భక్తి తోటి యెరుక విడువు మన్నాడు
పతిలేని శూన్య హృదయ సతిని గనుమన్నాడు
నిత్యం గురు సేవలోన నిలచి యుండమన్నాడు ॥శివుని॥

7. ధర విశ్వతారణాక కాలనీలో వెలశాడు
పూర్ణబోధ దయానంద పుణ్య పురుషుడున్నాడు
కరుణించి శిష్య బాదె రాములని పిలిచాడు
పరిపూర్ణ సూచనలో లేనివాడవన్నాడు ॥శివుని॥

## 47. కీర్తన

పల్లవి : సర్వశక్తి శాంతి సహన సాందీప స్వామీ
కరుణ జూపి శిష్య కోటి కలత బాపెనూ ॥సర్వ॥

చరణం :

1. నాలుగు వేదాల కవల పూర్ణ బోధ నూ
చులుక నగ నొక్కటని తేట పరిచెనూ
కాల కర్మ చక్రముల కర్మ తీగ నూ
అల్లు కున్న ఇహ పరముల సూత్రధారునీ ॥సర్వ॥

2. త్రైగుణ్య విషయ వేద కృష్ణ గీత నూ
భాగవత కృష్ణ దేశ పరము దెలిపె నూ
స్వయం బ్రహ్మ చేతనము సృష్టి కల్పనా
దయానంద రాజ యాఖ్య మృగజలమనేనూ ॥సర్వ॥

3. అవరణము భంగమని ఆశ వొదిలినా
విక్షేపము క్షేదనని బ్రాంతి బాపె నూ
రాగ ద్వేష యెరుక పక్షిరెక్కలు ఉన్నా
మద్గురు శ్రీ మంత్రముతో యెరుకలేకపోయెనూ ॥సర్వ॥

4. ఆది అంత్య విత్తుగల మధ్యజగమునూ
బోధ రూప సూక్తులు రహిత పరిచెనూ
ములుమోప సందులేని పూర్ణబయలునా
కల యెరుక ఉనికి తాను కోలు పోయెనూ ॥సర్వ॥

5. ఎన్నెన్నో జన్మముల పుణ్యమొ కానీ
మన కోసం వెలసినారు అచల ఋషులనీ
సత్య ధర్మ పరిశోధన పుణ్య పురుషు నీ
నిత్య పూజ పాదసేవ వ్యధను మాన్పు నూ ॥సర్వ॥

6. కేంద్ర పీఠ అధ్యక్షణ జగన్నాథునీ
జ్ఞాన రత్న దీపమున సాందిప స్వామి
శిష్య బాదె రాములని అభయమొసగెనూ
జనన మరణ రహిత ముక్తి పదమునిచ్చెనూ ॥సర్వ॥

## 48. కీర్తన

1. ఎక్కడో లేదులే సాందీప యాఖ్యుడూ
మన మెక్కడుంటె అక్కడనే యున్నాడూ
ఒక్కసారి గురుని జేరి పూర్ణబోధనెరిగితె
సంకల్ప కర్మరహిత జన్మమృత్యుపోతుంది ॥ఎక్క॥

2. ఉన్న దేమో అచలము ఎప్పుడూ
కాని దాన్ని నీవు యెరుగలేవు ఎప్పుడూ
ఉన్నది పరబయలనీ నిజమునీకు దెలిసిన
నేను మేను లహము వీడి క్షణమైన నిలువలేనూ ॥ఎక్క॥

3. యెరుక మరుపు లెరుకలేని బయలనీ
పరిపూర్ణ బయలునాదో చినకళనీవనీ
ఉన్నది గురుడన్నదినే కన్న దంతటున్నదనీ
ఉన్నదేమో ఉన్నది నేనన్నదే లేకున్నదనీ ॥ఎక్క॥

4. ముక్తి నొసగె దాత మనకు ఉన్నాడూ
శక్తి యుక్తిగా నిలచి తోడై యుంటాడూ
ఏకానేకములుగా ఉన్న యెరుక ఉత్తముడూ
భక్తి జ్ఞానవైరాగ్య తూర్యతీతాదెలిపినాడూ ॥ఎక్క॥

5. పంచీకృత పంచ భూత లోనబైట ఉన్నాడూ
ఎంచి జాడ యెరుక లేని ఉత్తదిగాయున్నాడూ
దేహి దేహములుగాని దేవుడంతటున్నాడూ
ఆత్మ తీత కేవలాత్మ ఆవల నిండున్నాడూ ॥ఎక్క॥

6. నిత్య పూజ నీయుడూ దయా నందుడున్నాడూ
సత్య ధర్మ స్వప్రకాశ సాందీపయాఖ్యుడూ
శిష్య బాదెరాములుకు పరముదెలిపియున్నాడూ
స్థితప్రజ్ఞ లక్షణంబు భక్తుల కెరిగించినాడు ॥ఎక్క॥

# 49. కీర్తన

1. దరిశనమాయెనుగా । శ్రీ సాందీపస్వామీ । దరిశనమాయెనుగా ।
దరిశనమాయెను । జన్మతరించెను । పూర్వజన్మ నా పుణ్యవశంబునా
॥దరిశన॥

2. ఎన్నో జన్మల పుణ్యము జేసినా
తిన్నని గురు కృపా జూపిన శ్రీ గురునీ ॥దరిశన॥

3. క్షర మక్షర కళ సుర స్వప్నమెరుకనీ
యెరుక యెరిగన కళను మేల్కజేసిన గురునీ ॥దరిశన॥

4. పిండాండహమును బ్రహ్మాండ హమునూ
పిండాబ్రహ్మాండహము బాపిన శ్రీ గురునీ ॥దరిశన॥

5. జీవాత్మ పరమాత్మ ఏకామావల లేనీ
భవనాశనము లేని బయలేసూచన గురునీ ॥దరిశన॥

6. బంధామోక్షము లెరుక రహిత యోగముగన్నా
కదలాని దచలాము పరమైయున్నాగురునీ ॥దరిశన॥

7. బహు రూపముల ఆత్మబ్రమలు పడుతుందాని
ఇహ పర భోగముల విడిపించినా గురునీ ॥దరిశన॥

8. పయనించే ఈ చిలుక పుణ్య పాపములానీ
నయమున విడిపించెనయశాలి శ్రీ గురనీ ॥దరిశన॥

9. శ్రీ దీక్షి తాచల అధ్యక్ష పీఠమునా
సాందీపయాఖ్యుని దివ్యామృతగురనీ ॥దరిశన॥

10. శిష్యుడైన బాదె రాము లెరిగిన వన్నీ
కైవల్య దేహంబు నిర్గుణ ముక్తానీ ॥దరిశన॥

## 50. కీర్తన

పల్లవి : సాందీప సద్గురు వచనామృతం
అద్వైత రహిత మె అచలామృతం ॥సాందీ॥

చరణం :

1. పంచీకృతా పంచ భువనాల సృజన
పంచాబద్ధా యెరుక మరపులామారిన
పరముకు పరమైన ఈనిజ బయలున
ఎరిగిన యెరుక కళ స్వప్నవిడుమనె ॥సాందీ॥

2. ప్రాగార్ద చరమార్థ యోగాములకుసం
యోగాము గావించి క్షరమక్షరొకటాని
పదిరెండు పదముల చరమార్థమిడచేను
పదియారు పదమెరిగి ప్రాగార్థంబాసేను ॥సాందీ॥

3. అరయంగ గురుభక్తి అమరుండనేనైన
కర్తృత్వ రహితంబు కర్మాచరించేను
తిరిగి రాని బాట రాత తుడిచిన వన్ని
తెరదీసి త్రిగుణాల అతీతూనిజేసిన ॥సాందీ॥

4. ధర సికింద్రాపుర పీఠ అధ్యక్షుడు
తుర్య స్వరూపుడు సాందీపయాఖ్యుడు
దాసుడైన బాదె రాములని పిలిచాడు
స్థిత ప్రజ్ఞ స్థితిమనకు అందించియున్నాడు ॥సాందీ॥

## 51. అ॥ప॥చి॥ జంగయ్యరాజు కృతం

కరుణేశ్వరా । గురుపరమేశ్వరా
మము కరుణించగరావా ।
దేవాకరుణించగరావా ।

1. శరణంటిమీ । మీపదమంటిమీ
మము కడతేర్చగరావా ।
దేవాకడతేర్చగరావా । ॥క॥

2. మీచరణములే । మదినమ్మితిమీ
సత్యము మీరని । గురినిల్పితిమీ ।
కరుణించగ రావా । దేవాకరుణించగరావా ॥ ॥క॥

3. మీశుభనామము । మాకు పవిత్రము
మీశ్రీ చరణము । మా పుణ్యఫలమూ ॥ ॥క॥

4. మీ కృపకై ఇల । వేచితిమయ్యా
మీ ఆజ్ఞను । పాలించెదమయ్యా ॥ ॥క॥

5. మీ దివ్యకరుణతో । ఈ శిష్యజనులను
ధన్యుల జేయగ । రావాదేవా ॥క॥

6. ఈధరణీ శ్రీ గురుసాందీపిని ।
జంగయదాసుని । చేరదీసె నిదె ॥క॥

## 52. అ॥ప॥చి॥ రామకృష్ణ కృతం

తత్త్వము

పరమాత్ముడమ్మా గురుదేవుడు కరుణాత్ముడమ్మా

1. పరమాత్ముడోయమ్మ గురుదేవుడును సుమ్మా
జనన మరణంబూల జడుపు దీర్చెడి గురుడు ॥పరమాత్మ॥

2. బ్రహ్మాండమదియాని పిండాండమిదియాని
పిండ బ్రహ్మాండముల భ్రమనుతీర్చెడి గురుడు ॥పరమాత్మ॥

3. ఆది ఆంత్యము తెలిపి ఆత్మ నెరుగజేసి
ఆత్మపరమాత్మల ఐఖ్యపరచెడి గురుడు ॥పరమాత్మ॥

4. సత్యాము కారణమాసత్యం కార్యంబాని
సత్యా సత్యంబూల సాక్షి దెలిపెటి గురుడు ॥పరమాత్మ॥

5. అయిదైదు లిరువాది ఐదైన దీయాత్మ
ఆత్మమూలము దెలిపె నతడె సద్గురుమూర్తి ॥పరమాత్మ॥

6. శరనన్నవారాల కరునించి గురుమూర్తి
తిరిగిపుట్టని మరుగు తెలియజేసెడి గురుడు ॥పరమాత్మ॥

7. ద్వాదశి షోడాశి ద్వయమంత్రములు దెలిపి
దండీగ ఎరుకాను దృంచివేసిన గురుడు ॥పరమాత్మ॥

8. శివరామసిద్ధాంత పీఠ అధ్యక్షుడు
దయానంద పొన్నాల సాందీపుగురువరుడు ॥పరమాత్మ॥

9. ఇలలోన అచలపురములోని శిష్యుడు
రామకృష్ణుని జన్మరహిత పరచిన గురుడు ॥పరమాత్మ॥

# 53. అ॥ప॥చి॥ వెంకటేశ్వర్లు కృతం

పల్లవి : గురుచరణం సద్గురు చరణం సద్గురు చరణం భవహరణం
గురుమహారాజ్ సద్గురు మహారాజ్ పరాబ్రహ్మ సద్గురు మహారాజ్ ॥గురు॥

చరణం :

1. తనువుకు మూలం తల్లిదండ్రులని
తలపోయుట మది కాదండి మూలమైనది
ముందుగా దెలిపిన సద్గురు చరణం భవహరణం ॥గురు॥

2. అండము ఇదియని పిండము ఇదియని
అండపిండమును నెరుగజూపి
అండపిండ బ్రహ్మాండము గానిది
అచలము దెలిపిన గురుచరుణం ॥గురు॥

3. ఎరుకయు ఇదియని మరుపిదియేయని
ఎరుక మరుపులను తేరగజూపి
ఎరుక మరుపులు లేనిది అదియని
అచలము దెలిపిన గురుచరణం ॥గురు॥

4. వెంకన్నను ఇటు రమ్మని పిలిచి
సాందీపయాఖ్యుడు కరుణ జూపెను
లేనిది యెరుక లేదని తెలిపి
వెంకన్నను భ్రమరహితుని జేసిన ॥గురు॥

# 54. జెండావందన పాట-1

## అచల ధ్వజ ప్రార్థన

అచల కేతనంత్వమున్న యాఖిలాసుదిక్షుత
త్సుచరిత ప్రపూర్ణతత్వ శోభితం మహోన్నతమ్ ॥
అచలపూర్ణ బోధరూపమంచి తాత్మభాసకమ్
సచివ సర్వకర్మ తంత్రజాల హరణ కారణమ్ ॥

జననమరణ మోహరహిత చరిత తత్వ బోధకమ్
అనుపమాన మూర్తి మంత మఖిలలోక దీపకమ్ ॥

దినకరేందువహ్ని మధ్యదేశ సుగమతేజసమ్
సనకయోగిమౌని బృంద సన్నుతంసమంజసమ్ ॥

వ్యోమ పవనవహ్ని వారి సర్వభువనస
త్సోమ భాస్కరాత్మ మధ్య సూక్ష్మగంనిరంజనమ్ ॥

కామలోభ మత్సరాది కలుషమూల భేదనమ్
నామరూప వర్జితం సనాతనాచలాన్వితమ్ ॥

ఘోరపాప వనజదూర కుముద బాంధవోపమమ్
ధీరరాజ యార్యయోగి దేశికేంద్ర వర్ధితమ్ ॥

సూరి బృంద భావ్యబాహ్యశోధనం వివేకదమ్
నారసింహ రచితబోధసార పూర్ణసంపదమ్ ॥

## 55. జెండావందనం పాట - 2

పల్లవి : ఎత్తండి సద్గురుని జెండా । మినుముట్టనెత్తండి సద్గురునిజెండా

అనుపల్లవి : దేశదేశాలలో దివ్యదీధితులొప్ప
ఆచంద్రతారార్క మవనిపై విలసిల్ల ॥యెత్తండి॥

1. సకల దేశాలలో సర్వకాలాలలో ।
సర్వ జాతుల వారి సమదృష్టి వీక్షించి ।
స్త్రీ పురుషులందరిని దీవించి శరణిచ్చి ।
శాశ్వితంబుగ వారి జన్మరహితముజేయు ॥ ॥యెత్తండి॥

2. యుగయుగాలుగ జన్మవాగురులలో జిక్కి । జన్మకర్మలుదాట
సాధనేదోయనుచు । వ్యర్థసాధనలలో వ్యధలనొందే వారి ।
భ్రాంతి రహితము జేయు । పరిపూర్ణబోధంచు ॥యెత్తండి॥

3. వేదవేదాంతాల విజ్ఞానలక్ష్యంబు అచలఋషిపుంగవుల
నాదర్శమనియంచు వాంగ్మ నశ్చక్షువుల । పరిధిదాటి తెలియ ।
పరిపూర్ణ గురుకృపా పాత్రులకే సాధ్యమని ॥యెత్తండి॥

4. కామ్యేచ్ఛజేసేటి కర్మమార్గము కాదు । రోగముల గొనితెచ్చు
యోగమార్గము కాదు । సంగముకు బరువైన సన్యాసమాకాదు ॥
ఘనమైన రాజమార్గము మాదియని చాటి ॥యెత్తండి॥

5. ఇహపరసౌఖ్యంబు లెల్లరకుచేకూర్చ । అన్యోన్యసహకార ।
మభివృద్ధి పరచంగ । విశ్వతోముఖశాంతి వెల్లివిరియించంగ ।
అచల ప్రబోధయే । అతిసూటి మార్గమని ॥యో॥

6. ఈ రాజమార్గన । ఈ ధ్వజచ్ఛాయలో । కలసి మెలసీ మనము ।
కదిలిపోవాలోయి । ఘనమైన యాత్రొవ । గనిలోకులెల్లరు ।
భళిశ బాసని మ్రొక్కి । వచ్చిచేరాలోయి ॥యో॥

7. గురుభక్తి గురుసేవ గురునిష్టచెడకుండ । త్రికరణశుద్ధికి
దెబ్బ తగులకుండ । భుక్తి ముక్తి క్రియల పూర్ణయోగముబూని
లోక సేవకుదీక్ష గైకొని జై యనుచు ॥యో॥

8. దీక్షిత సిద్ధాంత దేవమార్గములోన । పొన్నాలవంశాబ్ధి
పూర్ణచంద్రుండైన । రాజయోగీంద్రుల పూజించి కృపగాంచి
రామచంద్రునివలె రాజయోగముబూని ॥యో॥

## 56. జెండావందనము - పాట-3

1. శ్రీమదచలపరిపూర్ణ శివరామదీక్షితుల । జయమైన పతాకము
గనుడీ । వోసుజనులారభయభక్తిగ వందనమిడుడీ ॥శ్రీమదచల॥
యీమహిపొన్నాలవంశమణియగు రాజేశ్వరుండు సామర్థ్యము
తోడబుధులు సరెసరెయన నిలపినాడు । యీమీదలేదు చూడుడీ
రణభేరి వేసి యిలయందున చాట జేయుడీ ॥శ్రీమదచల॥

2. వేదాశాస్త్రంబుల కనాదియైన ప్రణవమునకు మీద సున్నగలదు
చూడయా । యీసున్న మరుగదేమొ తెలుసుకున్న ఘనులయా ।
వాదభేదరహితమైన శ్రీధరేంద్రులాదిగాగల । సాధువులీమరుగు
దెలిసి యీ ధరలొ జనుల కొరకు । బోధనెగర జల్లినారయా ।
మన జననమరణబాధ దొలుగ జేసునిజమయా ॥శ్రీమదచల॥

3. ఒంటుకుదాపల వలుపల నంటించిన బిందువులనుగంటిర యీ
పరమరహస్యమూ । మనమూల మెరుగకుంటిర యీ జన్మ
వ్యర్థమూ తంటలమారిది యెరుక తంటలెన్నోబెట్టినాది । తంట
దీర్పుకుందము యిటువంటి సమయమిగ దొరకదు । కొంటె
పనులు మాని వినరయా । గర్వంబుతొ వినకుంటిరయిది
మీకేచేటయా ॥శ్రీమదచల॥

4. పొలోజు వీరచారి పుణ్యమేమొ దయానందలీల సత్కరుణ చేతనూ । పతాకమునకు కేలుమోడ్చి వందనమిడెనూ । కూలీకై విషము ద్రాగు గురువూలనెగర గొట్టి । వాలాయము గనుభక్త వరులమంత పూజ సల్పి । పూలవర్షమును గురుపుదమా । నిజగురుపతాక లీలలు వర్ణింపుచుందమా ॥ శ్రీమదచలపరిపూర్ణ శివరామదీక్షితుల జయమైన పతాకము గనుడీ ॥

## 57. జెండావందనము - పాట-4

### మోహన - ఏకతాళం

నమో అచల జెండా జయజయ నమో పూర్ణజెండా ॥న॥

1. అమోఘ శ్రీ శివరామదీక్షితా
అఖండ బోధను జాటిన జెండా ।
దేశదేశముల మహోన్నతంబై
దీప్తి జెందినా దీక్షిత జెండా ॥ ॥న॥

2. జనన మరణముల బాధతొలుగునని
ఘనముగ జాటుచు నిలచిన జెండా ।
జనకుడాది ఘన రాజయోగులకు
సాక్షి శూన్యమని తెలిపిన జెండా ॥ ॥న॥

3. అహంబ్రహ్మమను ఓంకారంబుకు - ఆవల పూర్ణంబుం
డెనటంచును లేనిది లేదుళ్ళక్కియటంచును -
లెస్సగ జాటు సులక్షణ జెండా ॥న॥

4. సత్తు చిత్తు యానందముగా నిది నిత్యపూర్ణమని నిలచిన జెండా
సగుణ నిర్గుణా తీతంబైన చక్కని త్రోవను జూపే జెండా ॥న॥

5. ద్వైతాద్వైత విశిష్టములెరుగక ద్వంద్వ రహితముగ నెగిరేజెండా
జాతిమతములా జాడలు లేకను జగతి లోపల వెలసిన జెండా ॥న॥

6. ధీరుడైన పొన్నాల రాజఋషి దివ్యబోధలను చాటెడి జెండా
పాటల పంధరినాధుని పాట్లను బాపిన సద్గురు పావన జెండా ॥న॥

## 58. మంగళహారతి

1. మంగళమివరే మనగురుమూర్తికి । అంగనలందరుగుమిగూడి
సంగరహిత నిస్సంగుడై నగురుపుంగవుడేగతియనివేడి ॥మం॥

2. పాదంబులకభిషేకముజేసియు । పరిమళగంధములతోడ సాధు
పోషకుని షోడశోపచా । రాదుల పూజింపరెవేడి ॥మం॥

3. పారిజాత చామంతిపుష్పముల । హారంబులు మెడలోవేసి । తీరు
తీరు పన్నీరు అగరుక । స్తూరిరేఖ నుదుటను దీర్చి ॥మం॥

4. ధూపదీపనై వేద్యంబులు సంతోషమొంద విడియము లొసగి ।
పాపములన్నెడ బాపుమనుచుమది । నోపిదక్షిణములర్పించి ॥మం॥

5. సందులేనిదే పరిపూర్ణంబని ముందుగనెరిగించి యుమనలకెందు
లేనియీయెరుక మాన్పెను యేదియింక జన్మము మరల ॥మం॥

6. వేయుడి యిగరణభేరి గురునికీ । లెరిగేవారలు యిలమీద ॥
మాయనెలేదని చాటుడింకఅను । మానరహితమౌ యీబోధా ॥మం॥

7. ధరలోపల సికింద్రపురంబులో । దయానందుడై సుజనులనూ ।
కరుణజూచెపొన్నాల రాజయా । గురునకువందనమని యనుమూ ॥మం॥

8. యెంత మనోహరమే గురుబోధలా । యెరుక భ్రమలు వేగమె
వీడా । వింతగాదె యీ వీరచార్యుల । వెతలు దీర్చె చాలగవేడా ॥మం॥

## 59. మంగళనీరాజనం

### పల్లవి :

మంగళానీరాజనంబిదే మద్గురుదేవునకిపుడిదే ॥మం॥

### అనుపల్లవి :

మంగళంబు గురుపుంగవగై కొనిసంగము బాపినిస్సంగుల జేయుము

1. తల్లి, దండ్రి, దైవమీవెగా । తనుమానధనములు కొల్లగొన్న
జోదూవీవెగా తండ్రీ శరణంటిమయ్య । దరిజేర్చుక బ్రోవవయ్యా
నీకిదె ॥మంగళా నీరాజనంబిదే॥

2. శ్రీమించుపూర్ణాభావము ప్రేమించు నీదగునామజపమే సల్పా
వారము స్వామీ మా భ్రాంతిమూల మేతీరున నెట్టె దవానీకిదె

3. శ్రీయనసూయాయుతుడవై క్షేమంబు మీరగమామ కాహృత్పీర
వర్తియై రామచంద్రునేలిన శ్రీగురురాజయోగిదయానందులకిపుడిదె

॥మం॥

## 60. గురు మాతృక మంగళహారతి

మంగళం మంగళం । అనసూయంబ । మంగళం మంగళం

1. మంగళము నిత్య । మంగళరూపికి । రంగైనరాజ । రాజేశ్వరికి
పొంగుచు భక్తులు । పూర్ణానందమున ।
చలంగగ కోర్కెలొసంగేడి జననికి ॥మంగళం॥

2. అంబకంబుకంటి అఖిలలోకేశ్వరీ । ఆద్యంత సర్వభూతాదారిణీ ।
శాంకారి హ్రీంకారి । ఓంకార రూపిణి ।
పంకేరు హాక్షి । కామాక్షిమీనాక్షి ॥మంగళం॥

3. నిత్యనిరంజన । నిర్వికారగణ సత్యస్వరూపిణీ । సర్వసాక్షి ।
ప్రత్యగాత్మ బ్రహ్మ । భావైక్య రూపిణి ।
సత్యాసత్యములకు । సాక్షివైనజననీ ॥మంగళం॥

4. పంచభూతాది ప్ర । పంచములోనీవు । అంచితముగ మాయ ।
నాదుకొని పంచకోశముల । పరగనేకముజేసి ।
పంచీకృతముగాను । ప్రబలినమాయంబు ॥మంగళం॥

5. రాజరాజార్చిత । రాజీవలోచని రాకేందువదన । రతిరూపా ।
పూజాజేసెదమమ్మ । పుణ్యస్వరూపిణి ।
రాజీవలోచనీ । రక్షించవేజననీ ॥మంగళం॥

6. మున్నూ అనేకూల । బ్రోచితివనిమాతో ।
హనుమయార్యగురుడానతిచ్చె కన్నడజేయక । కరుణింపవేమమ్మ
వున్నదున్నట్లుగా యుక్తిజూపియుతల్లి ॥మంగళం॥

7. మురయూచు పొన్నాల । వరరాజయోగిహృ ।
త్సర సీరుహమునందు సాక్షిగను ।
నిరతము నిలచియు । పరమభక్తులను ।
మురయుచునేలేటిమూల ప్రకృతి వంబా ॥మంగళం॥

8. వాసిగాను బృహ । ద్వాశిష్టపీఠమున । భాసురముగవెలిగె ।
బ్రహ్మవిద్యా దూషించెదుష్టులను । శాశ్విత నరకాన ।
దోసిశిక్షించె పరదేవతైన జననీ ॥మంగళం॥

## 61. అ॥ప॥ బాదె రాములు కృతం

1. శ్రీ సాందీప సద్గురు స్వామి సేవకు రారమ్మా
పాదాభిషేకము జేసిన పావన మౌనమ్మా
అద్వైత సిద్ధాంత ములకు అందని గురుడమ్మా
ద్వయదోష రహిత గురునకు హారతులివరమ్మా ॥శ్రీసాందీప॥

2. నూటికొకోటికొ ఒక్కరు సాందీపస్వామమ్మా,
వింధ్యమాంబ సాధ్వికి నాథుడు విమలాగురుడమ్మా
గురువూలకు గురుడై వెలసిన పుణ్యపురుషుడమ్మా
సర్వజ్ఞుడు అచల గురునకు హారతులివరమ్మా ॥శ్రీసాందీప॥

3. పంచాకోశంబుల సంచును మించిన గురుడమ్మా
అష్టాదళ పద్మంబులకు అంటని గురుడమ్మా
సాంఖ్యా తారకమనస్కముల సారమెరిగెనమ్మా
స్వయం బ్రహ్మే మహా వాక్యములను హారతులివరమ్మా ॥శ్రీసాందీప॥

4. ద్వాదశి శోడశి మంత్రము చెప్పిదారి జూపు నమ్మా ।
స్థితప్రజ్ఞ లక్షణంబుల స్థితిదెల్పునమ్మా ।
మూలంబులేనిది యెరుకని భ్రాంతి బాపెనమ్మా
యిల వెలసిన పరమాత్మునకు హారతులివరమ్మా ॥శ్రీసాందీప॥

5. ధరవిశ్వకల్ప వృక్షము సాందీపస్వామమ్మా
పరిపూర్ణ బోధనా చార్యుడు పరమపురుషుడమ్మా
కరుణించి భక్తుల నందరి కలత బాపెనమ్మా
కర్పూరకళికభిరాముల కథయింతెనమ్మా ॥శ్రీసాందీప॥

శ్రీ సాందీపు సద్గురు పూజా విధానం

## 62. ఆనంద భైరవి - ఆదితాళం

1. పూజా చేతాము రారే । సాందీపూ సద్గురు । పూజా చేతామురారే
పూజాచేతామురారే పూర్ణుడైనిండున్న గురునికి । యోజామానిషామందు
నొప్పుగా నావాహనజేసి ॥ ॥పూజా॥

2. సర్వమునకాధారమనుచు । సస్వరూపునకాసనమిచ్చి
నిర్వికారుండైన వానికి । నిశ్చయో పాదార్ఘ్యమిచ్చి ॥పూజా॥

3. శ్రద్ధతో నిర్మాల్యునకు । భద్రముగా యాసానమొసగి
బుద్ధుడై నెలకొన్న ప్రభువుకు । శుద్ధధర్మా స్థానమొసగి ॥పూజా॥

4. బ్రహ్మాండ గర్భునాకు । సమ్మతీయను వస్త్రామొసగి
నమ్మి సర్వాలంబునాకు । నాలంబరహితూపరీతమొసగి ॥పూజా॥

5. రమ్యమౌ శ్రీగురువరునాకూ । కామ్యమను యాభరణామొసగి
సౌమ్యమౌ నిర్వాసూనాకు । పార తార గంధామొసగి ॥పూజా॥

6. శబ్ధ శూన్యా రూపునాకు । బద్ధ రాగాక్షంతలు నిచ్చి
లబ్ధవాసనతీతూనాకు । లలితపుష్పాలర్చనలొసగి ॥పూజా॥

7. బుద్ధికీయాతీతునాకు । శ్రద్ధయానే ధూపామొసగి
శుద్ధబోధ రూపూనాకు । సాధనానే దీపామొసగి ॥పూజా॥

8. నిత్యతృప్తుండైనవానికి । ప్రత్యహ నైవేద్యామొసగి
సత్యాసత్యాతీతునాకు । సమ్మతీ తాంబూలమొసగి ॥పూజా॥

9. యెందు జూచీనానూలేకా । పొందుగాతానందూవాని
పొందుతా తెలిసి । ఇంపొందుగా ప్రాదక్షిణమొసగి ॥పూజా॥

10. అద్వితీయుండైనవానికి । శ్రద్ధగా నుతి చేయూచూను
వేదవాచ్యాతీతునాకు । వాదరహిత శ్రవము జేయుచు ॥పూజా॥

11. స్వయముగా వెలుగొందువానికి । భయమనే నీరాజనమిచ్చి
భయముబాసి అంతర్భాహ్య । మయముగా వెలుగొందువానికి ॥పూజా॥

12. మారీకాపుర పీఠమునా । నిత్యమూ సద్గూరూ పూజలు
భక్తజనులను కడతేర్చుటకు । అభయమిచ్చిన సాందీపు ప్రభునకు ॥పూజా॥

## 63. ఆదితాళం

1. పూజకు నేనాస్తీ సద్గురు పూజ జేయనాస్తీ । పూజకు నేనాస్తి
పున్నపు వెన్నెల ఏడుమెట్టుల నిచ్చన ఎక్కి ।
వెలుగుదాటియో పూవులు కోసియూ ॥పూజ॥

2. కాయము చిత్తము శుద్ధియు జేసి ।
కలలో బ్రహ్మ జ్ఞానము పొంది
ధర్మము తెలిపిన మహాగురువునకు
అఖండ తేజము అర్పణజేయను ॥పూజ॥

3. పురుషోత్తముడే సృష్టికర్తయని । నేనుమేనులే యెరుకమరుపులని
పరిపూర్ణామే అచలబ్రహ్మమని । చాటి చెప్పిన సద్గురు మూర్తికి ॥పూజ॥

జయ జయ సద్గురు మహారాజుకు జయ

**సర్వం శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు**

**శ్రీ సద్గురు ప్రభు మహారాజకీ జై !**

**సంపూర్ణం.**



## శ్రీ మదచలర్షి రామడుగు శివరామదీక్షిత గురుపీఠ రాజయోగాశ్రమ

### సాంప్రదాయక గ్రంథముల వివరములు

| | |
|---|---|
| శ్రీ శివరామదీక్షితీయము చలాచల వాక్యములు - మొదటి భాగము | 10-00 |
| శ్రీ శివరామదీక్షితీయము ద్వాదశిభావము - రెండవ భాగము | 20-00 |
| శ్రీ శివరామదీక్షితీయము షోడశిభావము - మూడవ భాగము | 30-00 |
| శ్రీ శివరామదీక్షితీయము - నాల్గవ భాగము | 30-00 |
| వ్యాఖ్యానసహిత శుద్ధ నిర్గుణతత్వ కందార్థములు కంద పద్యములు | 75-00 |
| సుజ్ఞాన దీపమను గురుగీత తాత్పర్యసహితము | 30-00 |
| భద్రాద్రి రామశతకము విశేషార్థ సహితము | 30-00 |
| భూమానంద వాక్యత్రయము | 20-00 |
| అచల పరిపూర్ణ రాజయోగీయము నిజ ప్రబోధ విధానము | 40-00 |
| తారకామృత పరమహంస ప్రబోధిని | 15-00 |
| పరిపూర్ణ రాజవిద్య రాజగుహ్య శిఖామణి | 10-00 |
| అనన్యాచల పరిపూర్ణ ప్రబోధిని | 12-00 |
| సాంప్రదాయక పరిపూర్ణ ప్రబోధిని | 10-00 |
| అస్పర్శయోగము అను శ్రీమద్భగవద్గీత | 40-00 |
| రాజయోగి స్మృతి చంద్రిక | 5-00 |
| రాజయోగి విజయం | 20-00 |
| బ్రహ్మాండ పంచీకరణ పఠము | 5-00 |
| సాందీపినీహిత వాక్యములు | 40-00 |
| శ్రీ శివరామ దీక్షిత గురుపీఠ అనుష్ఠానవిధి | 20-00 |
|  | 10-00 |
| రాజయోగీశ్వర సుప్రభాతము | 5-00 |
| రాజయోగీశ్వర అష్టకములు | 5-00 |
| భక్త జన ముక్తావళి | 30-00 |
| తత్వ ప్రకాశిక | 20-00 |
| పరిపూర్ణ రాజయోగ తత్వ ప్రకాశిక | 10-00 |
| పరిపూర్ణ తత్వసుధ | 10-00 |
| పీఠనియమావళి | 5-00 |
| అచల పరిపూర్ణ రాజయోగ రత్నమాల | 10-00 |
| పరిపూర్ణబోధ సిద్ధాంత ప్రకాశిక | 5-00 |
| పరిపూర్ణబోధ సిద్ధాంత బుర్రకథ | 5-00 |
| యాజ్ఞవల్క్య జనక సంవాదము | 10-00 |
| ఉపాసనాకాండ మూడుపనిషత్తులు తాత్పర్యముతో | 10-00 |
| పరిపూర్ణ సిద్ధాంత శిరోభూషణము | 20-00 |